# గరికపాటి ఏకపాత్రలు

ర చ న

**గ రి క పా టి**

నవరత్న బుక్ సెంటర్
ఏలూరు రోడ్ * విజయవాడ-2.

# చాకలి తిమ్మడు

[ బుర్రమీసాలు - గిరజాల జుట్టుమీద తలగుడ్డ - మెడలో కంటె - చేతుల బనీను - ఎగదోసిన పంచకట్టు - భుజమీద వేలాడుతున్న చిన్న మూట - తిమ్మడు అలంకరణలు - వెక్కి వెక్కి ఏడుస్తూ... అయోధ్యానగరంలో రామచంద్రుని అంతఃపురద్వారం ముందుగా వచ్చాడు ... ముక్కు చీదేశాడు ]

తిమ్మడు :- తల్లిలాంటి సీతమ్మోరు - ప్రజల్ని కన్న బిడ్డలకన్నా ప్రేమగా సూసే మహా పతివ్రత... సీతమ్మోరు - ఎల్లిపోయారు ... అన్నేయం వుత్త అన్నేయం - నువ్వే దయ్యా సన్నాసడానికి ? [ముక్కుచీదేస్తూ కొంచం లోపలకు వెళ్ళాడు] పావం...నిండు చూలాలు – ఇయ్యాలో రేపో

పండంటి బిడ్డనికనే కన్నతల్లి సీతమ్మను... కారడవు కంపి...
సంపిచటం ... పాపం గదటయ్యా? మహాపాపం ! అహా!
వుండవయ్యా సెబుతాను చాకలి తిమ్మణ్ణి... ఎరుగరాయెట్రి?
గొప్పోరి మురికిని కడిగేవాణ్ని ! గురుతు పట్టలా?
అహా. యాడకంటావేంది నోకరూ? రావయ్య తండ్రి కాడికే-
ఎందుకంటా..నా? ఒరిసీతల్లి సిగతరగా! తెలుసుకుంటే...
కడుపు తరుక్కుపోతావుంది గదాంట - అన్యానయ్యా!
అన్యానం. అంటే ఆమె యిన అమ్మగోరిని అడివికి పంపెయ్యటమే
నాంట రాజనీతి? మంచీ సెబ్బర సూడకుండా ... పాపం
పున్నెం యిశారించకుండా పంపెయ్యడమేనాంట. రాజులు
చేసేపని? అందుకే ... పోతున్నా ... రామయ్య తండ్రి
కాడికి. అడిగేత్తానో- కొరిగేత్తానో... ఇంటావుగా... [కొంత
దూరం వెళ్ళి, భవనమంతా పరికించి చూశాడు]

తల్లిముండ మొయ్యా! నోకరూ? రాజభవనాలు ఆకా
శం మటుకు పెరిగాయిగాని. బుద్ధులు ఎదగలేదయ్యా! అసలీ
గోడల్లో కూకున్న ప్రతి యిటికబిళ్ళకూ. సీతమ్మోరి బతుకు
తెలునసయ్యా! ఆతల్లి కన్నీటికతలు ఎరిగినయిటికలు... కన్నీ
ళ్ళెట్లు కున్నయ్ నోకరూ! ఊకోండర్రా! పూకోండి -
అద్దదేవితో వచ్చినచావు, పూకోమంటే-పూకోరు గోడలూ
యేడిసి- గోవరాలు యేడిసి - పశువులూ యేడిసి - వచ్చి

జాతులూ యేడిసి- నన్నూ యేడిపిత్తున్నారుగందా! కాళ్ళాటం లేదు. కడుపు సెరువైపోతంది. వూరుక్కోండరా)! ఏడుస్తూ ముఖం చీదేశాడు. గుడ్డతో తుడుచుకున్నాడు] అరరరే... మీరూ యేడుత్తున్నారా? సెట్టుసీమలూ - వూలూ పుట్రా మాతల్లి కోసం బెంగెట్టుకుంటే మా రాజుకి మటుకు సీమకుట్టి నంత బాధ లేకపోయెనే- ఇద్దూరంగాపోతే- యింత దారుణా నికి పూనుకున్న ఆ పెద్ద మడిసికి జాలిమాటుకుంటదా యేటి? [ముందుకు వెళ్ళాడు]

అయ్య బాబోయ్! రామయ్యతండ్రి కూకున్నాడు. తల పట్టుకుని... కాళ్ళా సేతులూ ముడేసుకుని కూకున్నాడు- దండాలు బాబయ్యా! [చేతులు జోడించాడు. యెదుటపడి నా పేరు తిమ్మడు బాబయ్యా! నేనేం ఎర్రి రావుణిగాను. ఏలు కోటానికి అన్న తిమ్మణ్ని బాబయ్యా! తప్పయిపోయింది. (చంపలేసుకున్నాడు) ఓ మాట అడిగిపోదామని వచ్చాను. అసలా మహాతల్లి చేసిన తప్పేంటో...యిని పోదామని వచ్చాను బాబయ్యా! తమరు శాంతమూరుతులు- అవతార పురుషులు - తండ్రిమాట పాటించటానికి, పద్దాలుగేళ్ళు అరణ్నివాసంలో ఉండారుగందా! తొందరపడ్డారండి బాబూ! ఆమాటే అనమోకండి. కడుపు మండిపోతుంది- ఎందుకంటా

లేంది రామయ్యతండ్రీ? తాళిగట్టారుగందా! తలంబ్రాలు పోశారుగందా! అత్తోరింటో తిని కూకోవలసిన సీతమ్మోరు మీాతో బాటు. వద్దాలుగేళ్ళు అడవుల్లో గడపాల్సిన కర్మేంది బాబూ? అనువంటి మంచిమడిసిని అనుమానించటానికి మన సెట్టాఒప్పింది రాబూ? అవమానం మొయ్యలేక నేగంద. అగ్గిలో దూకి ది. మొఖుసూక్కుదుటపళ్ళేదా బాబూ?నిప్పువంటి సీతమ్మోరి మీాన నీలాపనిందలు మోపితే కట్టాలు తప్పవు. బాబయ్యా!

ఏం జేత్తారు? పేణం తీత్తారు. అంతేగా మీావని? ఆడేగా తవరికి తెలిసినవని? అసలే పిచ్చి జనమంతా రాపుశు దేవుడంటున్నారుగాని. బాబూ అనువంటి మంచిబుద్ధులు తవఁరికి మచ్చుకైనా లెవ్వేంది బాబూ? సల్లగొచ్చి ముంత దాచేయటాన్వారం... ఈ తిమ్మడికి గిట్టదు. రామయ్యతండ్రి! మంచిగానీ...సెడుగానీ... మొఖాన పగలగొట్టటమే నాకు తెలుసు- యుధవనాయాళ్ళంతా రాకఁరాజ్యం అంటున్నారు గానీ కాదు బాబూ యిది. రావరాజ్యం కానే గాదు. [ఎవరో కొట్టినట్లు, బాధగా చెంపచేత్తో బట్టుకుని "ఆబ్బా!" అని కేక బెట్టాడు.

కొట్టారా బాబయ్యా! నిజం మాట్లాడినందుకు నిట్టూరం

నా సెంపమీద అంటుకుంటదని నాకు ముందే తెలుసు. రామయ్యతండ్రీ! కొట్టండి. ఇదిగో రెండో చెంప సూత్తారేం? ఏదో గొప్పోరనీ... బీదాబిక్కీ జనాన్ని తండ్రిలా సూత్తారనీ... ఇంతకాలం మీ తప్పులన్నీ యీ గుప్పెట్లో కప్పెట్టి వుంచానుగా బాబూ! యెందుకు సెయ్యలేదంటే? ఒకటా? రెండా? మూడా? లెక్ఖెయ్యటానికి! అవును రామయ్య తండ్రీ! జాతి తక్కువే - అందుకని... మన రాజ్జంలో ఎవుడూ నిజం మాట్లాడగూడదాంట? అసలు నిజం మాట్లాడకపోతే మడిసి బతుకెందుకు బాబయ్యా! తగలెయ్యటానికా-పోతే! [చంకన వున్న మూట క్రింద పెట్టాడు. మరోసారి తలగుడ్డ సరిగా చుట్టి. మీసాలు సవరించుకున్నాడు] ఇయ్యాల ప్రత్యేకంగా మీ యవ్వారం తేల్చటానికే పనిగట్టుకుని వచ్చాను బాబయ్యా!

మనలో మనమాట సీతమ్మోరు చేసిన తప్పేంటి బాబూ? రావణాసురుడెత్తుకెళ్ళాడనీ రాసి రంపాన పెడితే... అగ్గిలోదూకి ప్రెతిత్తనం రుజువు చేసుకుందే మహాతల్లి - మల్లా అనుమానం యెందుకొచ్చింది బాబూ అవిఁగోరిమాటన" అర రకే... ఆడదంటే ఎంత అలుసైపోయింది? ఎంతపలచనై పోయ్యాది? మొగుడై పోయ్యోరు గవక తవరు బెట్టిన అరళ్ళనీ పద్దదిగానీ... ఇంకో తల్లయితే మాన్నాప్పకూడా

కాపరం సెయ్యదుబాబూ యినువంటే మొగోళ్ళతో అమ్మ తవర్ని కట్టుకున్నాక జానకమ్మ ఏం సుఖపడ్డది సెప్పండి? తప్పులు సెయ్యటం సాజమే రావయ్యా తండ్రీ! దాన్ని దిద్దుకుని. తొణుకూ బెణుకూ లేకుండా కాపరం నెట్టుకెత్తానే మడిసి బాబూ! ఆ మడిసిలోనే మహాత్తుంటది, బాబూ! ఆ మడిసే ఎదుగుతాడు బాబూ! ఆకాశంలో ఎలుగుతాడు.

భరతయ్యగోరికి...పట్టం గడతన్నారని తెలిసి - కన్ని కొట్టుకోలేదా తవరు? పద్దాలుగేళ్ళు రాజ్జం తమ్ముయ్య సేతిలో వుంటే...మల్లా మీసేతి కొత్తవో రాదోనని... బెంగెట్టుకోలేదా? కన్నోరిమీన అలిగి - అరిణ్యం ఎల్లావుగానీ.. కన్నయ్యమాట కాపాట్టానికెల్లా రాంటు? మాటలురాటం లేదుగాబాబూ! సవతల్లి కొడుకు...రాజై పోతన్నాడని - యీసుతో ... అసూయతో మరిసిపోటానికి ... మత్తుపానీయాలు తాగితాగి ... మంచితనం మరిచి పోయ్యారుగా బాబూ! నీను లేపోతే...ముద్దొత్తారా? ఆవులూ - అడవి పందులూ - జింకలూ - లేడిపిల్లలూ - బతికాయా బాబూ మీబాణాల తాకిడికి? వద్దన్నా...కద్దన్నా యినిపించుకోకుండ...పాపం...సీతమ్మోరికి తినిపించ లేదా కాలినముక్కలు? మాట్టాడరేంబాబూ? ఇయ్యన్ని అబద్ధాలేనా?

కట్టుకున్న నేరానికి...నారసీరలేకట్టుకుని...నానా అగచాట్లుపడింది - సిత్రకూటపర్వతం కాడికి ... పాదుకలకోసం భరతయ్యొత్తే...ఏఁవఁన్నారు? పాదుకలకోసం ... ఇక్కడిదాకా వచ్చావా తమ్ముడూ! అక్కడే అడిగితే...పాదుకలతో బాటు - ప్రాణసఖి...సీతను గూడ యిచ్చి వుందునే. అన్లేదా రావఁయ్యతండ్రి! [మళ్ళీ చావచేత్తో పట్టుకున్నాడు అశ్రుపూరిత నయనాలతో]

రావఁయ్యతండ్రి! తవఁరు నన్ను సెంకమీనే కొట్టగలిగారు...కాని...ఆయేల...సీతమ్మ... మీగుండెలమీన కొట్టిందిగా బాబూ ఒక్కమాటతో? అదీగుత్తులేదా మీకు? తమఁరు మగయేశంలోవున్న ఆడమనిసి" అని...ఆతల్లి కోపగించుకోలేదా!" చివ్వాడు మాటలు వినేసెద్ద అలవాటు తవఁరికి సిన్నప్పట్నుంచీ వుండనే వుంది...సెట్టుసాటున దాగి...వాలిని సంపారు. ఇశామిత్తురుడు యాగ్గం కాపాట్టానికి ఎంతమందినో హత్తెచేశారు - ఇంకెంత మందినో మట్టుబెట్టారుగా...మాట్టాడితే..."దుష్టశిచ్చణ- శిష్టరచ్చణ" అంటారు- ఆ రెంటికోసం పెళ్ళాలఁతియ్యాలా రామయ్యతండ్రి! మాత్తు లేదాంట? [సెత్తిమీద అరచేత్తో బాదుకున్నారు] నా తెలివి మండిపోను...తవరికాడ మాత్ గసక వుంటే...

సీతమ్మ జాడకోసం...హనుమంతుణ్ని ఎందుకు పంపుతారు? ఆ వెంగోరు ఎల్లినదారే తెలవకపాయె - తెచ్చుకునేదారి లేకపాయె...తవంరి మాత్తు యింకేంది బాబా?

అదికాదుబాబూ! నా వుద్దేశం అదికాదు...అవమా నించటానికే అయితే...పేణాలెందుకు తీత్తాను రావంయ్య బాబూ! కావాలంటే తీసుకోండి — కాని...బాబూ! మా తల్లి సీతమ్మను మల్లా యింటికి తీసుకురండయ్యా! జానకమ్మ కంటినీరుకు... ఈగడ్డ తరితే కరిగి ... వొయ్యాలై పోద్ది బాబూ! రెండుగా చీలిపోద్ది - ఆయమ్మ కడుపుమంట రగిలితే...పట్టణమంతా అంటుకుంటది రామయ్యతండ్రీ!

"ఏమంన్నారు? ఆతల్లి తప్పుచేసిందా? యాగాలక్కీ దేవమ్మా నిప్పు గందా బాబూ! నిండు చూలాలు మీాన నీలాపనిందలు మోపటం...నిజంగా పాపం బాబూ! అదే మన రాజ్యానికి శాపం...అన్నాను బాబూ! అన్నాను- అంత మాత్రాన ఇ టోంచి నేరమయ్యటమేనా? నాయాన్యాయాలు సూడక్కర్లేదా? మంచో - సెడ్డో యినక్కర్లేదా? అడది గందాని...అలుసుగా వదుంది గంవాని... నేరం మోపు

తారా? నన్ను సీల్చెయ్యండి- కాల్చెయ్యండి. లేపోతే... వూళ్ళోంచి దూరంగా తరిమెయ్యండి. కాని...కాని...అయ్య మ్మను సంపకండి బాబూ! సంపిత్తే పున్నామనరకం తప్పదు రావయ్యతండ్రీ! తప్పనే తప్పదు-

సెబుతాను రావయ్య బాబూ! ఎందుకన్నానో యివరంగా సెబుతాను. ఆయేల...వూరంతా పండగ మా ఆడదానిక్కీ నాకూ మటుకు తగాదా. తవరిక్కీ తెలుసుగా బాబూ!! మాలచ్చిమి- దాన్ని ఎంత ప్రేవంగో కట్టుకున్నానో ఎరికేగా బాబూ నగరానికి? ఒకరిమీన ఒకరికి మనసు కుదిరింది. మోజు పెరిగింది. సరేనంటే సరే అనుకున్నాం. కాని...దానయ్య అదే బాబూ. మాలచ్చిమి.. అయ్య. మూడేలు ముల్లెకూపండే... పిల్లనియ్యనని పట్టుబడితే తల తాకట్టుబెట్టి తాళిగట్టి అలిసే సేసుకున్నాను. రావయ్య తండ్రీ! మాలచ్చిమి ఏవనేదో తెలుసా బాబూ "ఒరే తిమ్మయ్య మామా! నువ్వేదకీ యిల్లు దాకరా! ఎత్తే సెం కూడా వదిలి వుండబుద్దెయ్యదు- యిద్దరట్టను ముద్దొత్తె బుద్ది కాదు. ఎల్లమాకరా!! అని యేడిసేది బాబయ్యా మాలచ్చిమి! అనువంటి మాలచ్చిమికి మొఖను మారింది. పక్కింటి పోలిగాడితో సరాసకాలకు దిగింది. ఆయేలరేత్తిరి మాల

షరోమడిసి దొరకలేదా బాబూ! సేనాపతులూ- రాజ భటులూ కసాయోళ్ళు మన నగరంలో కరువయ్యారాని ?

నిప్పులేందే పొగ రాదంటారు. నీరు పల్లమెరుగు-నిజం దేవుడెరుగు, అంటారు. తవంత దేవుళ్ళు- రావయ్యతండ్రీ! నిజం తెలవదనమోకండి- లచ్చువయ్యనే సంకటానికి దింప టంలో మీా అనుమానం ఏంది బాబూ! మాట్లాడలేరు. తలపైకెత్తలేరు- గుండె నిబ్బరం చేసుకోలేరు- సెగా సెగం సివికి, సితిలామండే గుండెమంటను ఆరవుకోలేరు. నా అను మానమే మీా అంగీకారం- అంతేనా రావయ్యతండ్రీ! అంతేగా! అంతేనా బాబూ అంతే__

నిప్పు ముట్టుకుంటే సెయ్యి కాలుద్ది- తప్పు నొట్టుకుంటే యివరం తేలుద్ది- ఇప్పుడదే జరిగింది. జరిగింది గనక అదే అయితే... మరి మాతల్లి సీతమ్మగూడ... మాలచ్చిమిలాగే (దింపలు వేసుకున్నాడు) తప్పు రావయ్యతండ్రీ! బేటి కన గూడదు అంటే నలుగురూ యింటారు- యింటే...నడి బజా ర్లో నొవ్వుకుంటారు. నొవ్వితే దేవుడవ్వాల్సిన రావుడు... రాయిలాగే అయిపోతాడు- అయినా...తొందరపడ్డారు. ఆ[illegible] సం లచ్చుకయ్య బయలుదేరినప్పుడే అనుకున్నాను

బాబూ! ఏదో కిటుకుందని- లోగుట్టు పెరుమాళ్ళకే ఎరక రావయ్య తండ్రి—

అసలు మీనాన్నగోరు...ముగ్గురుతో సరిపెట్టుకుంటే ముచ్చటగానే వుండేది - కాని మూడోందల యాబయిమందిని కట్టుకున్నాడు - అట్టుడికినట్టు వుడికిపోయ్యింది అయోధ్య నగరం - ఇకతవరు? ఎంతమంది లేరు? సీతమ్మగారిక ... గడపదాటలేదు గనక... సరిపోయింది ... అదే నగరంలో పోక్కితే - అదే వాడవాడలా యెక్కితే ... పరువేంగాను? రాచరికవు మరేదతేంగాను? సెప్పండి బాబూ! సెప్పండి -

అదేరామయ్య తండ్రి! అదే మనరాజ్యంలో వుత్తి మడిసి గుండెలో రగిలేమంట - అదే కడుపు మంట - పసూవు బట్టలై నా మానంకపోయే - పెళ్ళిముచ్చటన్నా తీరకపాయే- అచ్చువయ్య సీటుకున పయనమయ్యాడే రాటానికి - ఓ మాట పెళ్ళాన్ని అడిగాడంట! సెప్పదా బాబూ! ఎంత యిదిలే పోతే...యింటబడి వత్తాను? అంతదూరం రొండు కులే రావయ్యతండ్రీ? తవరు సీతమ్మోరిని సంపి రమ్మని పంపారుగందా? మరిసంపలేదేం!

అయ్యో నా సావిరంగా! అదీ తెలవదా రామయ్య గోర్హూ! మరి ఏంతెలుసు బాబూ తవరికి? కన్నతండ్రి

మాట...తవరన్నా కాపాడుతన్నారుగానీ... మరి ... అన్న సెప్పినమాట...యిన్నాడా లచ్చువంయ్యా? వదిన్నిడిసిపెట్టి వచ్చేశాడు – పిచ్చిమారాజులు గాబట్టి నమ్మారు – అసలు ఎవుడే మాటసెబితే... ఆమాటినటం – ఆళ్ళుసెప్పినట్టు సెయ్యటం మీరాకు అలవాటు బాబూ!

ఇంకోమాట అడిగి వెల్తాను రావంయ్యతండ్రీ! ఆయాల తవంరు గుర్రాన్ని వదిలితే... దాన్ని కట్టేసింది ఎవురని? బుడతలు – ఆ తల్లి కొడుకులు – లచ్చువంయ్య యిద్దానికెల్లి – ఇద్దరికీ తగలకండా బాణాలేత్తంటే... బుడతలు లచ్చువంయ్య సేవన్నారు బాబూ? గుడ్డోడన్నారు – కొల్లకన్నులోడు అన్నారు – వయిసుముదిరి – మసకొచ్చిందని ఎగతాళి చేశారు – ఇంతింతబుడతలు పడగొడితే – గమ్మున నేలకొరిగాడుగాని... ఆళ్ళ వంటిమీద ... యీగవాలకండా చూశాడుగా బాబూ లచ్చువయ్యా! ఇదంతా ఏవంటారు? కన్నప్రేవం కాదంటారా? కడుపులో నుంచి పొంగుతున్న మమకారం కాదంటారా? ఇదంతా యిదికాదంటారా?

ఇదంతా...యిదే కాదంటారా?

అవును బాబయ్యా! ఎది ఏమైనా బేటికంటానికి... ఈ తిమ్మడెవుడు? జాతితక్కువోడు – నీతిమాలినోడు – నిజం

మాట్లాడే యథవ - అంతేగా రామయ్యతండ్రి! గొప్పోరి బతుకులు యెంత అడ్డదిడ్డంగా వున్నా - దేవుళ్ళయిపోతారు బాబూ సిటికెలో - కాని... మేవుఁ? అన్నింటికీ కరువుపడే వోళ్ళం...మంచితనంతో బతుకుల్ని యీడుసుకపొయ్యే వోళ్ళం - లోకం దృష్టిలో రాళ్ళలాగనే మిగిలిపోతాం బాబూ! దేవుళ్ళ పేరువిూన సెలామణి అయ్యే విూలాబోటి వోరికాళ్ళకింద నలిగిపోతానే వుంటాం - కాని...రావఁయ్య తండ్రి! ఇప్పుడు గాపోయినా - ఎప్పుడైనా...ఈనిజం బేటి పడితే - దేవుళ్ళూ - రాళ్ళూ ఒక్కటేనే అని ... ముందు తరాలవారు గుర్తుబడితే - మన పేరులు సెరిగిపోతయ్ బాబూ! మన కతలు మారిపోతయ్ - మనగురుతులు మాసి పోతయ్ - [క్రిందకు వంగి మూట ముల్లి చంకన తగిలించు కున్నాడు.]

నేనంటం లేదు రావఁయ్యతండ్రి! లోకం అంటుంది - సీతమ్మోరు బేటికెల్లగానే - మనింటో ఎలుగు ఆరిపోయింది. మొగుడూ పెళ్ళాల మద్దెన... యెన్నోతగాదాలు వత్తాయ్ బాబూ! వాటిని గుప్పెట్లో బెట్టుకుని...గుండెల్లో దాసుకో పోతే...ఎలితైపోతాం. కుడితిలో బడ్డ ఎలకలా కొట్టుకులాడ తాం - అంతే బాబూ! కట్టాల్లోనూ- సుఖాల్లోనూ తోడూ

నీడగా వుంటానని... బాస చేసి... బాసికం కట్టిన... మొగుడు ఆడదాన్ని నీశకంగా సూత్తే... ఆడు తరతరాలకూ మడిసి కానే కాడని... ఈ లోకం అంటాది రామయ్యతండ్రీ! అప్పుడు ... నెత్తీ నోరూ బాదుకున్నా... పోయిన పెళ్ళాంగానీ- పోగొట్టుకున్న పరువుగానీ... తిరిగి రానేరావు బాబూ! వత్తా!

[అంటూ రెండుచేతులు కలిపి... నమస్కరించి ... చరచరా బయటికి వెళ్ళి పోయాడు.]

—: సమాప్తం :—

# విచిత్ర యముడు

[ప్రాంతం ఏదైనా కావచ్చు- సూటూ- బూటూ హేటూ- నల్లని కళ్ళద్దాలు- చేతిలో హేండ్ స్టిక్- విచిత్ర యముడు ఆభరణాలు- అప్పుడప్పుడూ హేటుతీసి వుంగరాల జుట్టు పైకి ఎగురవేసే అలవాటుమాత్రం వుంది. అతని ముఖంలో ఆనందచ్ఛాయలు కన్పిస్తున్నాయ్- ప్రకృతి సౌందర్యాలు చూస్తుంటే...ఆపారవశ్యంలో ఒక్కచోట ఆగిపోయాడు]

[ 3 ]

రులు బట్టి- పరుగులు దీయుచున్నారు. [ఇంకా కొంతదూరం నడిచాడు- తీగె కాలికి తగిలినట్లు ఆగిపోయాడు]

ఆహా! నదీనదముల సమూహము! సమైక్యతలేని గ్రామసీమల నేకముచేయు ప్రవాహము- అగాధములు పొంగినవా? సముద్రములు వుప్పొంగినవా? ఏమో...జలచరములు- అంతా జలమయము! ప్రళయము (ఒక్క నిముషం పరీక్షించాడు) అయ్యారే! ఇక్కడ ప్రకృతి ప్రకోపించినది. పల్లెలనూ- ప్రజలనూ, పశుగణములనూ... నీటముంచినది! సందియము లేదు. ఈఘోరవిపత్తుకు హేతువేమైయుండునో... ఈ గుట్టలనెక్కి తరంగములపై- మృదంగముల ధ్వనుల కారణమవలోకించెదగాక... (అంటూ- ఎత్తుగావున్న ప్రదేశము మీద కాలుమోపి- కంగారుపడి... "అయ్యారే" అని పెద్దగా అరిచి పక్కకు తొలిగాడు] అయ్యారే- ఇది శవములగుట్టయని... ఎరుంగకయే... కాలుబెట్టి కంగారుపడిపోయితిని... నా అసమర్థతను- అజ్ఞతను వీక్షించిన పాటివారలు నవ్వకుందురా?

ఆఁ...నవ్విన నవ్వనిమ్ము... పరిహసించిన పరిహసించనిమ్ము- ప్రాణములన్న పరమాత్మునికైననూ నంతభయములేకుండునా? రవ్వంత గగుర్పాటు కలుగకుండునా?

ఆహా! బిడ్డలకు దూరమైన తల్లులు- తల్లుల గానని పిల్లలు అక్కలను పోగొట్టుకున్న తమ్ముళ్ళు- చెల్లెళ్ళు-సతులకు దూరమైన పతులు- పసుపుకుంకాలు కరువైన సతులు పసుపు బట్టలే మాయని నూతనదంపతులు. ముద్దు ముచ్చటతీరని క్రొత్త పెళ్ళికొడుకులు- అక్కరలే తీరని నవయువ్వన స్త్రీయులూ- ఎందరో ఇంకెందరో. మరెందరో- మరణించినారు అయ్యారే ఈజలప్రళయ విలయతాండవంలో పల్లెలకు పల్లెలే విధ్వంసమైనవి- శోకతప్తమూ- శోచనీయము-

దహన సంస్కారముకైననూ నోచుకొనని యీ మృతకళేబరమ్ముల...భూమాతసైతము గర్భమున దాచుకొన సాహసించలేదు...ఎంతటి [illegible]! ఎంతటి అప్రతిష్ఠాకరము! [అక్కడనుండి పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ మరో చోటికి చేరాడు. కళ్ళకు చేయి అడ్డం బెట్టుకుని ... నిశితంగా చూశాడు.] ఓయీ! నీవు ఎవ్వడవు? ఏకతంబున ఒంటరివై చెట్టుకొమ్మల వ్రేలాడు చుంటివి! మారుపలుకని... యీతని మౌన వ్రతాకథనము చూడ...మరణించినవాడిలా గోచరించుచున్నాడు! ఓయీ! మాట్లాడవేమి? ఆహా! ఈ మంద భాగ్యుండేదరినుండి...యీ దరికి కొట్టుకవచ్చినాడో గదా!

[మరికొంత దూరం నడిచాడు] ఏమిటా ఆశ్చర్యము! నట్టనడి సముద్రాన...కొట్టుకువచ్చిన ఒక్కటే...సదనము - ఆసదనము పైభాగాన...పడిన త్రివిరాద...రక్త సిక్తమైన ఒక్కడే మనిషి...ఈ శవాలగుట్టలకు పట్టముగట్టుకొన కొలువుదీరెనా ఏమి? అయిననూ...పోయి పలుకరించెదగాక ... [తటపటాయిస్తూ – భయకంపితుడై నడిచాడు.]

ఓయీ! నీవు సజీవించి యుంటివా? లేక జీవముల్లైవేచి యుంటివా? అయ్యారే...ఈతడు కదలాడుచునే యున్నాడు...కథనమెంత శోకతప్తమైయుండునో! ఓయీ పలుకవేమి? ఏమనుచుంటివి? భార్యాబిడ్డలను కాపాడుకునే యత్నము విఫలమై...వారు పోగా...మిగిలియున్న జీవశ్చవానివా నీవు? సహాయము చేయువారలుగా నీ - సానుభూతి చూపు వారలుగానీ...ఎవ్వరూ రానేలేదా? అహో... ఎంతటి విడ్డూరము! ఎంతటి విచిత్రము! నన్నే ఎరుంగవా? ఓరీ పాంథుడా! యమపురమ్మునకు ఏకైక రాజుండను - యముండను నామధేయుండను. తెలిసినదా? ఏమిటా వెకిలి నవ్వులు? ఏమిటా పరిహాసలాస్యములు? ఓరీ దురహంకారీ!

సువర్ణమణిమయ మకుటములు శిరమందిడనంత మాత్రమున -
వజ్రవైఢూర్యాది భూషణములు ధరించనంత మాత్రమున -
దక్షిణ హస్తంబున గదాదండము లోపించినంత మాత్రమున
మహిష వాహనుండను కానంత మాత్రమున - నిరాడంబ
రుండనై - నిరాధారుండనై వచ్చినా యముండు - యముండు
గాకుండునా? అగ్గి నిప్పయిననూ - నిప్పు అగ్గయిననూ...
భగ్గుమనక పోదురా ధూర్తుడా! [నవ్వుకుంటూ ... మరో
నాలుగడుగులు వేశాడు ]

ఓహో! మారువేషధారినై ... భూలోకమున కేతెం
చిన కారణ మెరిగించమను చుంటివా? అట్లయిన సావధాన
చిత్తుండవై - ఆలకింపుము - సిరులతో - గిరులతో - అమృత
ఝురులతో భూలోకము స్వర్గతుల్యమై శోభాయమానమై
విలసిల్లుచున్నదని యమదూతలు చెప్పగా విన్నవాడనై -
కన్నుల పండుగచేసుకొన... మహిష వాహనుండనై -గదాదండ
ధారుండనై - సర్వాలంకార భూషితుండనై - యమలో
కము విడచి - భూలోకము పయనమైతిని, కొంతదూరము చేరిన
పిదప... విశ్రమించవలెనన్న యూరటకలిగి - మహిషమును

మఱ్ఱిపూడలకు కట్టివేసి - మణిమయ మకుట భూషణాదులను మూటగట్టి...తలక్రింద దిండుగా బెట్టుకొని ప్రయాణ బడలిక చేత కనులు మూసితిని ... అంతియే ... మెలకువ వచ్చిన తోడనే - లేచి చూసితినిగదా! మహిషము మాయమైనది - వస్త్ర శస్త్రములదృశ్యము లైనవి. ముష్కరులెవరో తస్కరింపకుండిన యెడల...ఏమైయుండును? వాయువు నోటకరచుకొని...ఆకాశమున కేగునా యేమి? ముల్లోకంబులు సైతము-మదీయ ప్రజ్ఞా ప్రాభవాలకూ...యమపాశబంధాలకూ...దాసులై - బందీలై...పాదచరణములే శరణ్యములని ... పడియుందురుగదా! అంతటి ఘనుండైన యీ యముండు...నేడు ...వస్త్రహీనుడై - అస్త్రహీనుడై - దీనుడై - దిక్కులు లెక్కపెట్టు సమయమ్మున ... ఎవ్వడో మహానీయుడు ... కాదు కాదు...మానవుండు...మదీయ అపమాన భారంబు గ్రహించి - అభిమానము చూపినాడు - మానము కాపాడినాడు- ఇప్పటికైననూ తేటతెల్లమయినదా... మదీయ ప్రజ్ఞా ప్రాభవ మెట్టిదో! [అంటూ మీసము మెలిపెట్టబోయి - చేతికందక...నాలుక కొరుక్కున్నాడు - జుట్టు ఎగురవేసి.]

ఏమనుచుంటివి ? దివిసీమయా యిది ? దివ్యలోకమును మించు సౌందర్యము లిట మన్నయిపోయినవా ? గ్రామాలకు గ్రామాలు తుడిచి పెట్టుకపోయినవా ? నిజము ! నిజము !

ఉప్పెన ఉవ్వెత్తున లేచి ... వుగ్రరూపంతో కరాళ నృత్యము చేసినది - ప్రకృతి మాత పసిడి పంటలనూ కడుపు పంటలనూ - మిత్తవు మింగినది ! సముద్రగర్భము చీలి... తునాతునకలై - అగ్నిగోళములు ప్రకంపించి పగిలినవి - రగిలినవి. అహో ! కనీ వినీ యెరుంగని ఉప్పెన - మిత్తవ జలప్రళయము - ఇచ్ఛట తాండవించినవి. గాండ్రించినవి - గర్భములో దాచుకున్నవి గ్రామసీమలను - అంతియే ... అయినను ... ఉత్తముండగు ... యీ యముండకు తెలీకుండ ... అనుమతి బడయకుండ ... అనువులు మ్రింగు హా ! ఎవడిచ్చాడీ వుప్పెనకూ, మిత్తవకు, పొంగిన వుప్పెనకూ... పొగరెక్కిన మిత్తవకూ... ఆయువు మూడిన గాని... యిట్టి అవాంతరము కలిగించి యుండవు — గిలిగిల లాడిననూ విలవిల లాడిననూ ...ఎంతటి మహారాజు ప్రాణములనైననూ యిట్టే తీసికొను హక్కు భుక్తములున్న యీ యముండు ... ప్రకోపించిన వీటి ప్రాణములు తీయకుండ జీవించియుండుటే ..

దుర్లభము ! దుస్సహము ! [ మరోచోటికి భారంగా నడిచాడు ]

ఓయీ! మీరంతెవ్వరు? శవగణముల విభజనచేయువారలెవ్వరు? ఓహో! ఖననముచేయ ప్రభుత్వము పంపగా వచ్చిన భటులా మీరు? అయ్యారే... ఎంతటి సాహసవంతులు! ఎంతటి నవీన సంకల్పములు. ఆ మృతకళేబరముల వేరుచేయుచుంటిరేల? అహో! ఏమీ వైపరీత్యము! ఏమీ వింత విడ్డూరము భారతదేశచరిత్ర- సంస్కృతి- యింత దిగజారినదా? ఇంతటి దౌర్భాగ్యము పెరుగపోయినదా. యీ బంగరుగడ్డలో? అగ్రవర్ణములనీ... అంత్య వర్ణములనీ- ఎవరు తెల్పినారు? గొప్పవారికి గోరీలు- పేదవారికి సమాధులు కట్టుకున్న పైవారు బలిచేయుదురా? అయ్యారే... దుర్దినములు సంభవించకుండిన... యిట్టి విపరీతబుద్ధులు పుట్టనే పుట్టవు- ఎంతటి నిరంకుశత్వం! ఎంతటి నియంతృత్వం! ఎంతటి నీచమైన ఆధిపత్యం!

మట్టిలో జనియించిన వారంతా... మట్టిలో కలిసిపోవుటేగద... యుగధర్మము! అంటరానితనము అదృశ్యము కావలెననిగదా... మీ బోసినవ్వుల తాత... పంచ పైకెగగట్టి స్వాతంత్ర్యము తెచ్చినది? వెలి- అంటరానితనము సంఘబహిష్కారము- క్షమించరాని నేరములని గదా ప్రభుత్వం

ఉత్తర్వులు! ఏమనుచుంటిరి? (ప్రకటనకారుడు- హాస్యం ధ్వనించేలా] అవియన్నియూ వృత్త ప్రగల్భములేనా? వృత్త పరిచ్ఛన్న ప్రవచనములేనా? ఆహా! కాలమెంత వక్రించినది!

కులమూ- కులమూ- కులమూ అని కఠిన శిలాశాసనములు సృష్టించిన ప్రభువు లెంత దుర్నీతిపరులో ఇప్పటికైననూ బోధపడిందా? ఓరీ అమానుషులారా! ముందు తరాలవారికైనా యింత న్యాయం పంచిపెట్టే బాధ్యత మీకు లేదా? భావితరాల పౌరులకైనా గుక్కెడు చైతన్యం గుప్పెడు సానుభూతి- గొంతులోపోసి- మానవతాజ్యోతులు వెలిగించే దక్షత మీకు లేదా? కులమతాల కుటిలనీతిని - కూకటి వ్రేళ్ళతో పెకలించగలిగే శక్తి-సామర్థ్యం భరతఖండంలో ఒక్కడికీ లేదా? శక్తి శౌర్యాలు- ఆవేశావేశాలు- అదృశ్యములా? మానవజాతి సమ సమూ నిర్వీర్యమైపోయిందా?

ఆహా! మీరంతెవ్వరు? మంత్రిపుంగవులా? అట్లయిన కన్నీటి లోతు లెరుగని మీకు... ఈ కడలిలోతు లేమి తెలియును? మేఘముల ముసుగులు తొలగించుకుని తొంగిచూచే మీకు ఇక్కడ ప్రాణములు విడిచిన మానవతా గుండెల లోతు ఏమి తెలియును? చెప్పితినిగదా! యముండను నామాట

యుండను. యమపురమ్మునకు... ఏకైక రాజుండనని- అవును
శవఖననము గావించుటకునూ- కులముల ప్రస్తావన తెచ్చిన
కూపస్త మండూకములంటే నాకు కడుపుమంట- ఈగుండెల
మంటలు మిమ్ములను అంటకముందే- జ్ఞాననేత్రములు విప్పండి
అంటరానితనమునకు సమాధులు కట్టండి.

అయ్యారే! ఏమిరా ఈ అసందర్భ ప్రలాపములు?
మానవ మేధస్సనే గాఢ తమస్సులో ముంచివేసిన ఈ కుటిల
తెరిని తరిపివేసెదను. కొంచము ఆలోచించుకొనుడు- అట్లయిన
అరుంధతిని పెళ్ళాడిన వశిష్ఠుడు ఏ కులము వారు! అతనికి జన్మిం
చిన శక్తిమహర్షి- ఆ శక్తిమహర్షి కొమరుడు పరాశరుడు...
ఆ పరాశరునికి బుట్టిన వ్యాసుడు... ఏకులము వారు? ఏజాతి
వారు? భారతాన్ని- భారత సంస్కృతినీ సాహిత్యాన్ని సము
జ్జ్వలంగా వ్రాసిన... ఆ వేదవ్యాసునికి జన్మించిన పాండు
రాజు- ధృతరాష్ట్రుడు... ఏ కులమునకు చెందినవారు? అంత
యేల? ద్యూతక్రీడాలోలసుడై- తమ్ములనూ... ఇల్లాలినూ
పందెములో వడ్డి- ఓడిపోయి- పదునాలుగు వత్సరములు
వనవాసము- ఒక్కయేడు అజ్ఞాతము గడిపి- యుద్ధోన్మ
త్తులై- పదునెనిమిది అక్షౌహిణుల సైన్యమును సర్వనాశ
నముగావించిన, పాండునందనుడు... [వికటంగా- వికృతంగా
నవ్వాడు] కాదు కాదు. మానందనుండగు ధర్మరాజు... ఏ
కులమువాడు?" పోరాడు- పురోగమించు. గెలిస్తే భూలోక

రాజ్యం చస్తే స్వర్గం— అని యుద్ధరంగంలో సింహనాదం చేసి ఆవిష్కరించిన వీరగీత భగవద్గీత- అట్టి మహాతత్వం ప్రమాణంగా గల భరతసమాజం. కులమతాల పునాదిలో కూరుకు పోవడం ... సిగ్గుచేటు— లజ్జాకరము! అవమానము- అపహాస్యము- అప్రస్తుతము—

ఎందులకా? భళారే! నవతకు చెదలు పట్టలేదా? నైజము నైచ్యముగా లేదా? జాతీయత ఛిన్నాభిన్నం కాలేదా? వర్ణవ్యవస్థ ముదిరి కఠిన కులాలుగా చీలలేదా? అవును... నాలోకము యములోకము- అక్కడ సమతవుంది: మమతవుంది- నవతవుంది! మానవతవుంది- అందులో యింకనూ. నిత్యనూతనమై- సత్యవిధానమై... వెలుగొందు చున్నది' వెలలేనికీర్తి ప్రతిష్టలకతీతమై యున్నది.

నాలోకమున కులములు లేవు - కుటిల నీతులు లేవు. మతములు లేవు - మాధ్యములు లేవు - కుబేరులు లేరు - కుచేలురు లేరు - గరీబులుగానీ ... గనీబులుగానీ ... ఏక వంక్తిలో నిలవవలసినదే — తత్వాల చిట్టాముందు తలలు వంచవలసిందే నవ్వండి ... ఇంకా పెద్దగా నవ్వండి దిక్కులు పిక్కటిల్లేలా నవ్వరేండి - ఉప్పెన వచ్చిన కత్వం బున పూరడింతమని... చూసితినిగానీ . లేకున్న నాకేమక్కర వచ్చె... యిక్కడకు వచ్చితిని? కుడిసింహాసనముపైన ఒక్క

సారి చేయిమోపి – యమపాశములు విసిరినచో - వలలో చిక్కిన మత్స్యముల చందమ్మున - మీరలు బంధీలు కాకుందురా? నాలోకము రాకుందురా? అహో! ఉపేక్షించిన కొలదీ...మరీ ఉన్మత్తులై...పేట్రేగుచున్నారే పరిహాసవచనమ్ములతో మదీయ ప్రాణములను గాయములు చేయుచున్నారే! వికటాట్టహాసములతో డెందమ్మును కుందుచున్నారే అయ్యారే...ఎంతటి అవాంఛనీయము! ఎంతటి అకృత్యము!

ఇంతటి ఘోరవిపత్తునకు కించిత్తు భయము నొందక... దర్పములు పలుకు మీనాలుకలను సర్పముల చేత కరిపించకుండిన ఉత్తముండగు యముండు వ్యర్థుడే...అసమర్థుడే - [చరచరా కొంతదూరం నడిచాడు.] అహో! కుడిచి కూర్చుండగాలేక భూలోక సందర్శనాభిలాషినై ... ఏల రావలె? వచ్చితిని పో...ఒక్క నిమిషంబు విశ్రాంతి కుక్రమించి – మహిషంబునూ - మదీయ వస్త్రశస్త్రములను – ఏల విడనాడవలె? విడనాడితిని పో...ఘనుండైన యముండు...దీనుండై నిరాడంబరుండై - నిరాధారుండై - భూలోకమునకు ఏల చేరవలె? చేరితినిపో - ఉప్పెనవాతబడిన దివిసీమకేల నరుగవలె? అరిగితినిపో...ఇచ్చట ఘోరపరాజయము నొందుట - కుందుట...సిగ్గుచేటు - సిగ్గుచేటు - సిగ్గుచేటు

చిత్రము వేయివ్రక్కలై - ముక్కలై పౌరుషహీనుండైన యీ యముండు జీవించి యుంటే దుర్లభము!

ఓయీ ! మానవులారా ! మదీయ ప్రజ్ఞాప్రాభావాల్లకే... అప్రతిష్ఠకలిగించిన మీ అహంకారములు నేటితో అంతము కావలె? ఎందులకో ఎరుంగరా? అయ్యారే! ఎంతటి నయవంచకులు! ఎంతటి నిర్భీతిపరులు! చదువులేదు - సంస్కృతి లేదు...సమత లేదు...సాహిత్యపస లేదు- కనీసము సానుభూతి చూపుటకైననూ...సరిజాలని చిన్నహృదయములు మీవి- ఇంకనూ మీరు...అధికారపు పీటలమీద కూర్చుంటే అగద్దెల నుండి...విమానపు గద్దలనుండి క్రిందికి దిగకపోతే.. దించడానికీ...గద్దించడానికీ ప్రజలు సిద్ధమవుచున్నారు... సంసిద్ధులవుతున్నారు - మీ దౌష్ట్యములు విరిచి - మీ దురంతాలను...దిగంతాలకు తరిమివేసే తరుణమాసన్నమయినది! పదవుల చదరంగములో ప్రజలను పావులనుగాచేసి... యింత కాలం ఆడుకున్న మీకు నేటితో ఆయువు తీరినది...

నేనిప్పుడే యమపురంబున కరిగి ఒక్క కాటిపై నడువ నిచ్చగింపని మిమ్ములను పట్టి బంధించుటకు యమదూతలను పంపెదను - అప్పుడు...అనువులు అరచేత బట్టుకుని ... నా పాదముల చెంత ప్రణమిల్లెదరు - పాపపుణ్యములు... కుల గోత్రములు లెక్కలు కక్కించు నయమమ్మున...ఏడ్చినా - పేమార్చినా ... నవ్వినా...పచ్చకాగితములు రువ్వినా ... కాపాడగల మహానీయుడు ఒక్కడూ లేక ... కానరాక ... విలవిలా ఏడ్చెదరు - కాగుతున్న నూనెలో వేపుతున్నప్పుడు

తలుక్కుమన్నదిగదా! పరిమళా ప్రసూనంబులు ప్రణమిల్లవలెనను పరవశంతో - ముచ్చటలాడుకొనుచున్నవి. నేనెంతటి అదృష్టవంతుడను. ఎదుటి అదృష్టవంతుడను! [అనుకుంటూ ముందుకు నడిచాడు. పెదవులపై చిరునవ్వులు ఒలకపోశాడు.]

కలలు పండవలసిన— ఆకన్నుల్లో కన్నీళ్ళా? వెన్నెల నిండవలసిన యీ అశోకవనంబు- కలతలతో కాలిపోవడమా? [వికవికానవ్వాడుగాని... ఆ నవ్వులో గాంభీరత లేదు- అపహాస్యధ్వనులు తప్ప] ఇంద్రజాలకుడు-మంత్రగాడు- మాయలమారి- దొంగగాడు- వేషగాడు- కపటి- కసాయివాడు- దుష్టుడు- ధూర్తుడు- దుర్నీతిపరుడు- [మళ్ళీ గలగలా నవ్వేశాడు] భళా! భళా జానకీ! ఎంతటి నీచమైన బిరుదములు ప్రసాదించుచుంటివి! ఎంతటి ఘనసత్కారము గావించుచుంటివి! దుర్దినములుగాకున్న నీకిట్టి దుర్బుద్ధి పుట్టునా? చాలించు నీ వ్యర్థప్రలాపములు- చాలించు యిక నిరంతర- నిరర్థక విలాపములు—

నవరత్నఖచిత సింహాసనాధీశుండైన యీ రావణుండు- సువర్ణమణిమయ మకుట తట- ఘట- గణీఘృణి మానధనుండైన యీ రావణుండు - అధిక బలసంపన్నులు- అత్యంత ప్రియమైన భ్రాతృసమానులు- మైరావణ- కుంభకర్ణాది ఉద్దండులకు—పెద్దవాడైన యీ రావణుండు-ఇంద్రా

దులను సైతము క్రిందుమీదూ చేసి- మునిపుంగవులను
ముప్పతిప్పలుబెట్టి- గరళకంఠుని పాదపీఠంబైన కైలాసపర్వ
తమునే భుజస్కంధములపై మోపి- మోసి- ఆత్మలింగమునే
హస్తగతముచేసుకున్న - యీ దశకంఠుడైన రావణుండు
నేటికి నీనోటి దూషణములు భూషణములుగా ధరించవలసి
వచ్చినందులకు- ఖిన్నుడై - దుఃఖసంపన్నుడై - గుండెతడి
యారి... విలపించుచున్నాడు జానకీ! విలవిల్లాడుచున్నాడు-
(అర్భాటంగా నవ్వడానికి ప్రయత్నించాడు. కాని...ఏదో
జీర గొంతును మూసివేసింది- రెండడుగులు వెనక్కి వేశాడు]

సీతా! నీపలుకులు అశ్రుస్రుతములు. నీచేతలు అనం
దర్భములు- నీ ఆలోచనలు అవాంఛనీయములు- నిన్ను కాక
వలెనన్న తలంపు నాకు కలిగిన...నిన్ను కాపాడువాడెవ్వడు?
నీతో క్రీడించగల వాంఛ నాలో జనించిన- నిన్ను కాచువా
డెవ్వడు? ముట్టవలెనని...ముచ్చట తీర్చుకోవలెనని-ఇచ్ఛయే
నాకువచ్చిన- నిన్ను లంకాపురంబున అంతఃపురంబులో పట్టు
జలతారులు పొదిగిన పసిడి మంచములమీద పరుండబెట్టక
ఇచ్చట తరుచ్ఛాయల నీడలు నీకు నివాసము చేయుదునా?
సుమదళాల సహవాసము చేయింతునా? [మళ్ళీ మీసమ్మీద
చేయివేసి...ముందుకు నాలుగడుగులు వేశాడు- మళ్ళీ పులి
గోరు...కళ్ళకద్దుకున్నాడు- ఏదో గుర్తొచ్చింది- గబాలున...
వెనక్కి తిరిగాడు]

అంతయేల జానకీ! నాడు... నీ స్వయంవరం ప్రక
టించిననాడు- అందరి మహారాజుల ముందర ధనుర్భంగముగా
వించి- ముత్యాల తలంబ్రాలు కుమ్మరించి- అలినిచేసుకుని...
లంకాపుర వైభవాలకు నిన్నా మహారాణిని చేసియుందును
కదా! ఆ కారణమున నేనక్కడికి రానేలేదు- ధనుర్భంగము
గావించలేని అసమర్థుండనే అనుకొమ్ము- నిన్ను భూగద్దతో
సహా పెకలించి- అరచేత బెట్టుకుని- ఆకాశమార్గమున

అవలీలగా యెచ్చుటకు చేరిన అదృష్టవంతుడనుగానా?
అధిక బలసంపన్నుడనుగానా? [వికటంగా నవ్వి... మరోసారి
మీసానం మెలితిప్పాడు - గర్వం పుట్టిపడేలా] ఇంకనూ ...
మదీయబలదర్పములూ - సకలవిద్యా చతురతలూ ... తేట
తెల్లముకాలేదా జానకీ?

అబద్ధము! అయ్యది నూటికి నూరుపాళ్ళు అబద్ధము,
బలవంతుడైన హనుమంతుడు...లంకాదహనము గావించె
నన్నమాట...ముమ్మాటికీ అబద్ధము- చెట్టుకొమ్మలమీద...
గుట్టమిట్టలమీద - కుప్పిగంతులు వేయగలడేమోగాని...
లంకాపురంబు ప్రవేశించగలడా ఆంజనేయుండు? ప్రవేశిం
చిన...మాతమ్ములు - రాక్షస బృందములు ఆకొంటిబట్టి -
తుదముట్టించి - ఒక ఆట పట్టించి యుందురే! స్తోత్రులకూ -
నాతులకూ - చుప్పనాతులకూ ... భీతిచెందువాడు కాడీ
రావణాసురుడు- [ఆకాశం బద్దలయ్యేంత పెద్దగా నవ్వాడు]

అతడు రామభక్తుడే అగుగాక! రామనామసారమే అతని జీవనాధారము అగుగాక - వాయుపుత్రుండైననూ - వాలాయుధాధరుండైననూ అగుగాక - ఆతని భక్తి ప్రపత్తులూ - యుక్తి చమత్కృతులూ - మాశక్తి సామర్థ్యముల ముందు... సాగిల పడవలసి దే - గిలగిలలాడవలసినదే సీతా! అహో! అదియా నీసందేహము? అదియా నీసంతాపము! సద్గుణ సంపన్నుడైన రావణుండు అన్యమనస్కుండు కానిచో నిన్నేల గొనివచ్చునని యా నీయూధ అభిప్రాయము? (తమాషాగా నవ్వాడు ఆనవ్వు అందంగా - హాయిందాగా వినిపించిందీసారి] నీకు కాబోయే మగండు... ఎంతటి ధీరుండో - కార్యశూరుండో... మాతమున్న కోరికయేగాని... మరొండు కారణముకాదు... కానేరదు. కాగూడదు జానకీ! శ్రీరాముడే సీతామనోరథుడై, అయోధ్యానగర ప్రజాంతరంగాలు... ఆనందతరంగాలు చేయునని, ఆశపడితినేగాని ... విచార ఛాయలు - విషాద నీడలు నిండించి... విఫలుడవు కాడని ... కలలో గూడ వూహించలేదు జానకీ! వూహించనేలేదు-

అతడు కార్యదక్షత కలవాడే కావచ్చు - నీరాముడు నీలమేఘశ్యాముడే కావచ్చు... దేవుడే కావచ్చు - కాని ... చరిత్ర ప్రసిద్ధికీ... పవిత్ర ప్రతిష్ఠకూ - అర్హతలు లేనివాడు - అవసరాలు తీర్చలేనివాడు - దారిమావువాడనీ - దంజేస్తుడైవమనీ.. దేవుడనీ,.. నమ్మి... అయోధ్యానగర వాసులు -

మోసపోయారు - బలానికీ ... అమృతజలానికీ ... మొఖంవాచిపోయారు - (చరచరా మరో చెట్టు క్రిందికి చేరి...చేయి ఆనించి - తీవిగా ఆ మొవంక...తల ప్రక్కకు తిప్పి - నిలబడ్డాడు.]

నిన్ను పుట్టింటికే తీసుకువచ్చితిని - [పెదాలమీద నవ్వాడు...శ్వాసపీల్చాడు - భారంగా వెనక్కినడిచాడు] అవును సీతా! పుట్టింటికే తీసుకవచ్చితిని - ఆశ్చర్యముగా నున్నదిగదూ? నమ్మ బుద్ధి కావడం లేదుగదూ? జనకుండే జనకుడని...మనసును కప్పిన మత్తు మమతనుండి ... విముక్తురాలివి...కాలేక పోతున్నావుకదూ? జనకుడు ప్రకటించిన స్వయంవరం నాడు...నేనక్కడికి వచ్చినది... నా అల్లుణ్ని చూసుకుందామనే గాని...జనకుడికి అల్లుణ్ని కావడానికి కాదు సీతా! కానే కాదు.- కట్టుబట్టలతో కారడవుల పాల్జేసిన ఆ రాముడు - కట్టుకున్న నేరానికి ... నిన్నేం కనికరించాడు? ఒకపూట...ఒక్కనాడు...మురిపించాడా? జీవితాన్ని మరిపించాడా? శక్తిహీనుడు — పౌరుషహీనుడైన శ్రీరాముడు.. నీకేం చేశాడు? నిన్నేం ఆదరించాడు?

అవమానించడం కాదు జానకీ! పొగడ్తలకు ఉబ్బి - అగడ్తలు దాటి ... అడ్డమైన పనులు చేయడానికి నేను రాముణ్ని కాను - రా...వ...ణు...ణ్ని - [మీసంపట్టి ... కళ్ళురిమి... దువ్వాడు] వేట...ఆతని క్రీడ. మత్తుపానీయ

ములు అతని ఆశ - మాంసభక్ష్యాదులు అతని యిష్టభోజన
ములు - కాదందువా సీతా? ఈమాటలు నిజము కాదం
దువా? నగ్న సత్యములు అబద్ధములందువా అనలేవు...
మహారాజైన వాడు - మగవాడు ... చేయవలసినపని కాదు
సీతా! అగ్నిసాక్షిగా పవిత్ర మాంగల్యాన్ని మూడు ముళ్ళు
వేసి - ఏడడుగులు నడిచి - అర్థాంగిని చేసుకున్నాడుగదా!
తిరిగి అనాథను చేస్తాడా? అంతరంగమునే కోస్తాడా!
సిగ్గుచేటు...సిగ్గుచేటు.

పర్ణశాల నీకు పసిడిమేడ అయ్యింది - కట్టుపీతాంబ
రాలు అదృశ్యములై - నారబట్టలే మానాభిమానములను
కప్పినవి - పర్ణశాలయందు పడతిని ఒంటరిగా విడిచి - యవ్వనుం
డైన తమ్ముణ్ని అంగరక్షకుడుగా నియమించడం పురుషత్వ
మేనా సీతా? మానవత్వమేనా? ఆ యిద్దరి అన్నదమ్ముల
అనుమానాలు - నీచుట్టూ ఏడుగీతలై... నిన్ను బందీని చేస్తే
...ఇంకా క్షమిస్తున్నావా?

అందుకే సీతా! అందుకే — శూర్పణఖను పంపాను -
ఆమె నా చెల్లెలు - నీకు మేనత్త - స్వయాన మేనత్త. సుఖం
పెంచిపెట్టమని అడిగిన నేరానికి - ముక్కూ చెవులూ కోశారు
పరాభవం చేశారు - అయినా నేను క్షమించాను. ఎన్నో
మారులు క్షమించాను. పాపి పసన లేనివాడూ కాడీ రావ

ణుడు- అరుణోదయము గాకమునుపే- నిత్యకృత్యములాచ
రించి...కోటి లింగాలకు పూజా పుష్పాలు అందజేసే నిష్టా
గరిష్టుడు రావణుడు - నిశ్చలమనస్కుడు నిర్మలప్రేమికుడు
జానకీ! కాముకుడు కాదు- కాలేడు-

నీ మాంగల్యాన్ని- సౌశీల్యాన్ని రక్షించడానికి నిన్ని
చ్చటికి తెచ్చితిని, అన్యమనస్కురాలవై - అపనిందలపాలవు
తావనే భీతిచేత...ప్రీతిచేత... నిన్ని అశోకవనంబునకు-
తెచ్చితిని-హాలాహలము మ్రింగిన ఆశూలాధరుడే...ఈ రావణ
భక్తిశ్రద్ధలకు ముగ్ధుడై స్తబ్ధుడై- పాదచరణముల చెంత ప్రణ
మిల్ల వలసినదే గాని... రావణుండెప్పుడూ... దైన్యవిలోలుం
డు కాలేడు- కాడు- అసురగణాధిపతికి...అధముల సాయమా?
అగర్భ శ్రీమంతుడైన లంకాపుర సార్వభౌమునకు- మారీ
చునితో సహవాసమా? ఈదశకంఠునకు యింకనూ- దర్పద
మావరించలేదు. (మళ్ళీ మెడలో వ్రేలాడుతున్న పులిగోరును
తీసి... కళ్ళకద్దుకున్నాడు- ఏదో జ్ఞాపకం వచ్చింది- ముం
దుకు నడిచాడు)

నీ జన్మవృత్తాంతమే విచిత్రము- పురిటినొప్పులు పడ
కుండనే పుట్టిన... నీ పుట్టుక విడ్డూరము సీతా! అస్కలి
తంగా జన్మించినదానవు నీవు - ఎన్నడూ అన్యమనస్కుడు
గాని...యీ రావణుడు... నయగారాలు ఒలికించే శృం

గారకన్య సౌందర్యానికి ముగ్ధుడై... మోహితుడై - కాముకవృత్తితో - కావులించుకున్నాడు జానకీ! ఆమె నీకు జన్మనిచ్చిన మాతృమూర్తి - రూపమిచ్చిన ధన్యురాలు - జరగకలసినది - జరగకముందే... అస్ఖలితముగా నీవు ఆమెపైబడితివి - ఆ మహాసాధ్వి అవనతయినది - కొంచము కలవరపాటుతో - కలతపడి అంతఃపుర ప్రముఖులనూ... వేదవిద్యాప్రవీణులనూ... రాజపురోహితులనూ - హితులనూ - స్నేహితులనూ పిలిపించి - సభాప్రాంగణమున... నీ జాతకఫలము కనుగొంటిని - కన్నుల నీరునింపుకొంటిని జానకీ! ఎందులకో? అస్ఖలితంగా జనించిన ఈబిడ్డ - మనగడ్డను మట్టిచేయునని - పండితులుచ్చరించిరి. ఈ పాపలంకనుదగ్ధము చేయునని - నాలో దుగ్ధరగిలించిరి - దుఃఖము కలిగించిరి. అప్పుడే సీతా! నిన్ను మందసమున పెట్టి - జనకుని పొలిమేరలలో పారవేయించితిని.

లేదు సీతా! జరిగినదే యిది ... పొత్తిగుడ్డలతోనే......పొలిమేరలు దాటించవలసినకర్మ దశకంఠునికి పట్టినది. యుక్త వయస్కురాలయిన పిదప - లంకకు చేటు వచ్చుననే - వేదపండితులశాస్త్రీయ శాసనములు పాటించిన పిమ్మట... నిన్ను దూరముచేసుకొంటిని - ధర్మము నాలుగు

పాదాల నడుమ జనకుడు నిన్ను పెంచినాడు- పెద్దచేసినాడు- సంతులేనికొరత తీరిన కతమున నిన్ను కనులకద్దుకుని- కంటికి రెప్పలా సాకినాడు- ఈమాటలు నీకు రుచింపకున్న... రేపటి చరిత్రలు ఘోషించకుండునా? సువర్ణాక్షరములతో లిఖించబడే ఈ రావణ జీవిత పవిత్రకథనము ప్రస్ఫుటము కాకుండునా? మమతలతో గుండెలు తరింపుకున్నవాడు. మనసులో మంచితనం నింపుకున్నవాడు...మన చరిత్రవినీ- కన్నీరుపొంగి పిడికెడు సానుభూతి- విసిరివేయకపోడు సీతా! నిప్పులాటి యీ నిజాన్ని నిర్దుష్టంగా చెప్పకపోడు___

అప్పుడే దశకంఠుడే కన్నతండ్రియని- కంటతడి పెట్టినప్పుడు- గుండె తడియారినప్పుడు- తుడవడానికైనా రావణుండు బ్రతికియుండడు- అందుకే ఒక్కసారి... తృప్తిగా ఆకన్నీళ్ళతుడవనీ- ! ఆ కన్నీటిధారలతో నా చేతులు తడవనీ! సీతా! సీతా! సీత...అంత కఠినంగా దూషించకు- అంత కృతజ్ఞతలేకుండా... నన్ను ద్వేషించకు శపించకు___

అహో! రాముడూ- రాముడూ- రాముడు- ఏడీ రాముడు? ఎక్కడున్నాడా శ్రీరాముడు? దైవసంపన్నుడూ- దైవసమానుడూ అయితే... నీజాడ తెలియడానికి తెలుసుకోవడానికి... హనుమంతుణ్ని పంపినాడేమి? మహాత్ములన్ని

ఏ తాయెత్తులో వుంచినాడు ? శక్తిసామర్థ్యములన్నీ ఏగంగలో ముంచినాడు ? ఆతడొట్టి పిరికివాడు- భయస్థుడు- సమరానికి వరిజాలని అసమర్థుడు-(మళ్ళీ గలగలా నవ్వాడు) వెర్రివాడు ...ఆరాముడు- శ్రీరాముడు—

నా వంశక్షయము గావించుటే... ఆతని లక్ష్యమని... ప్రగల్భములు పల్కుచున్న ఆ రాముడు... ఎంతటి నీచప్రవృత్తిగలవాడో - నేనెరుంగుదును- చెప్పుమందువా జానకీ! నీ రాముడొనర్చిన తప్పిదములు ఒక్కొక్కటే విప్పమందువా ? తాటకిని దునుమాడలేదా ? పరశురాముడంతటి వాణ్ని తెగటార్చలేదా ? శూర్పణఖను ఛిత్రవధచేసి పరాభవాగ్ని రగిలించలేదా ? తలెత్తకుండా చేయలేదా? ఇంకేమి చేయవలెను ? మానవుడు- అభిమానధనుడు- మహాత్తు కలిగినవాడు- ఘనుడు మేలమాడిన మేనత్తను ముక్కూచెవులూ కోస్తే సమర్థించుచుంటివా జానకీ ! ఛీ ! ఛీ ! ఆతని నామస్మరణం చేయుచుంటివా—

అవును- భిక్ష అడుగుటకే వచ్చితిని- అష్టైశ్వర్యములతో అధికబల సంపన్నులతో వైభవోపేతమైన లంకాపురమ్మునకు ఏకైక చక్రవర్తి... యీ రావణ సార్వభౌముడు భిక్ష అర్థించుటకే వచ్చినాడు - నీ ముంగిటకు- ముష్టికొరకు

కాదు సీతా! ముసిముసి నవ్వులకోసం- భిక్షఅడిగితిని- పొత్తు
లతోనే సాగనంపిన నిన్ను పుట్టింటికి తీసుకువెళ్ళి- చీని చీనాం
బరాలతో- అత్తవారింటి కంపుదమని వెర్రి ఆశతో చేయి
జాపితిని- పట్టు పీతాంబరములు ధరించవలసిన నీవు... నార
వస్త్రంబులతో తరుచ్ఛాయల నీడన- తలదాచుకొంటివిగదా
పట్టుపరుపులమీాద పవళించవలసిన నీవు - దండచేతులను
దిండుచేసుకుని- పాదధూళిలో పరుంటివిగదా! అట్టి నిన్ను
చూచుటకు - నాకు ధవళవస్త్రంబులు కావలయునా? అస్త్ర
శస్త్రంబులు అవుసరములా? మణిమయ మకుటంబులు అవ
ధార్యములా?

అందులకే... నిరాడంబరుండనై—నిష్కపటినై నిశ్చల
మనస్కుండనై— బాపడనై పసిపాపడనై - వచ్చితి- తెచ్చి
తిని- నీకిప్పుడు బోధపడదులే జానకీ! నీకిప్పుడు గోచరము
కాదు- రేపు రామరావణ సంగ్రామము జరిగి నీభర్త పరా
జితుడై వళ్ళంతా గాయములతో నిస్సహాయుడై - నీయె
దుట బడినప్పుడు- నీకు తెలియును- [పెద్దగా... నవ్వాడు-
దర్పమూ- ఆర్భాటమూ... బయటపడ్డాయ్ ఆనవ్వులో]

ఈ దశకంఠుని తెగటార్చుటకు ... ఆ దశరథతన

యుడేపాటివాడు సీతా? ఈ రావణబ్రహ్మను కయ్యమున
ఓడించడానికి - ఆరాముడెంతటివాడు? మదీయశక్తియుక్తుల
స్రవంతిలో జిలగబెడులా కొట్టుకుపోగలడు - నీ రాముడు-
అటులనా? అదియా నీధైర్యము? కూతురి పసుపు కుంకు
మలు నిలబెట్టెదననియా నీ గర్వము? అల్లునిపై యీగవాల
నివ్వననియా నీనీల్గుడు? భళా! సీతా నీవెంత తెలివైనదానవు
-ఎంత చురుకైనదానివి!

కన్నవారు... పెంచుకున్నవారు- ఏ గంగలో కలిసి
పోయినా- నీకు బెంగలేదుగదా? పురుడుపోసినవారు- బూడి
దలో కలిసినా... పుస్తెకట్టినవాడు- పన్నీరులో మునిగియుండ
వలెనా? అహో! ఎంతటి ఘటికురాలివి సీతా! ఎంతటి ఘట
నాఘటన సమర్థురాలివి! అందులకే "స్త్రీ బుద్ధిః ప్రళయాం
కం అన్నారు పెద్దలు-జానకీ! లంకాపుర వినాశనానికే" నీవు
జన్మించితివేమోగానీ... లక్షణంగా జీవించుటకు నీ మగం
డగు శ్రీరామచంద్రుడు- కడుంగడు సమర్థుడు మాత్రము
కాడు జానకీ! కానేకాడు- [ఆమె అన్నమాటలకు వికటంగా
నవ్వకుండా వుండలేకపోయాడు]

రెప్పపాటులో రాముణ్ని బందీకృతుడిని చేయగలను
సీతా! త్రుటిలో నీముగండను... సభామందిర మధ్యంబున

నిలబెట్టగలను - చూసెదవుగాక - [అంటూ తలొంచుకుని.. చరచరా కొంతదూరం నడిచి — ఎందుకో తటాలున ఆగిపోయాడు ఎవరో మొఱరొచ్చిన్నట్లు.]

భళా! భళా రామచంద్రా! రానేవచ్చితివా? పొదల బోయిన తీగ కాలికే తలినది. రమ్ము రమ్ము — నేటితో నీ ఆయువు చెల్లినది. ఈ నాటితో బత్తెపుగింజలు నిండినవి - రమ్ము- [పెద్దగానవ్వాడు...వికట్టాటహాసం చేసి] పిచ్చిరాముడా! ఎంతటి వెర్రిదేవుడవు! దేవ - గంధర్వ - యక్ష - కిన్నెర- కింపురుషాది మునిగణములంతా...భళా రావణా! యని ... వేనోళ్ళ కీర్తించుచుండ నీవా నన్ను గెల్చువాడవు? నీవా నాముందు నిల్చువాడవు?

భర్త లేని సమయమున్నూన పరపురుషుడు పర్ణశాలకు రావడం నీకు అపచారముగా నున్నదా? అవమానముగా నున్నదా? అట్లయిన ... ప్రతినిముషమూ పర్ణశాలయందే పడియున్న పడతికి ... పరపురుషుని ఏలకాపలాబెట్టితివి? కాదందువేమి? అతడు నీకు తమ్ముడే అగుగాక - సీతకు పరాయివాడు కాడా? ఈ డైనవాడు - ఇంటిదగ్గతే వుండవలసినవాడు - క్రొత్తగా పెళ్ళయినవాడు - పసుపు బట్టలే

మాయనివాడు - భార్యను వదిలేసి- సుఖసౌఖ్యాలకు ఆమెను
ఎడబాటుచేసి ... సీతో అరణ్యవాసమునకు రావలసిన
అగత్యమేమున్నది రామచంద్రా ? విడ్డూరముగాకున్న -
విధివై కర్తవ్యముగాకున్న దీనిని బుధులు శంకించకుందురా ?
పర్ణశాలా ప్రాంగణంలో పరాచికాలాడుకోవలసిన ఆలూ
మగలమధ్య ఆతడెందులకు ? నీకీ వేట లెందులకు ?

అందులకే రామ చంద్రా! ఈ అవనీ పుత్రికను తెచ్చి
తిని - అశోకవనమ్మున బెట్టితిని - అష్టయిశ్వర్యములతో తుల
తూగవలసిన యీ భూజాని... కాయగరబులు తిని - కటిక
వుపవాసములు చేయుట సహించలేక; పుట్టింటికే తెచ్చితిని -
అసమర్థుడైన శ్రీరాముడు... లంకాధీశుండైన దశకంఠునికి
అల్లుడని చెప్పుకొనుటకు వెగటుగా వుండిగదా! యింతకాలము
ఆరహస్యము దాచినది!

తండ్రీ కూతుళ్ళ మధ్య అక్రమసంబంధం అంటగట్టే
నీనాలుక వేయిచీలికలుగాకపోదు రామచంద్రా! ఈ నిజం
నిరూపణ అయిన నాడు - నీ ప్రేలాపనలూ - ఆరోపణలూ-
అదృశ్యములయిననాడు... రావణుడెంత విశాల హృదయుడు

గలవాడో - ఎంతటి ఉదారస్వభావుడో... నీకూ లోకము
నకూ ప్రస్ఫుటము కాగలదు –

అల్లుడా! ఇవి నీనోటినుండి రావలసినమాటలు- కావు
వ్యర్థ ప్రలాపంబులతో ... నిస్వార్థపరుడు ... నిష్టాగరిష్టుడైన
రావణబ్రహ్మను రెచ్చగొడితే...కత్తి కడితే ... నిలువునా
దహించుకుపోగలవు - ఓహో! అవతార పురుషుడవా నీవు?
అయోధ్యా నగర ప్రజలకు దేవుడవా? అట్లయిన... నీమతి
భ్రమణము తొలిగింపకున్న - ఈ దశకంఠుకిక మనలేదు
అల్లుడూ! గాఢాంధకారము కమ్ముకున్న నీగుండెల లోతుల్లో
వెన్నెల వెలుగులు ప్రసరింపజేయకుండిన ... నీవు ఉన్మత్తు
డవై ...నిజముగా చితిమంటలలో దగ్ధము కాకపోవు - ఆలో
చించుకొనుము - దేవుడవో - రాముడవో నాకెరుకలేదు
గానీ...ఈ సమయమ్మున నాకు అల్లుడవైతివి - నా కూతురి
నుదుట తిలకమైతివి - దానిని తుడిచివేయుట - చెరిపివేయుట
నాకిష్టములేదు - ఆలోచించుకొనుము -

ఆహా! ఈతని మనోవైఖరి చూడ - యుద్ధమని
వార్యమని సంకల్పసిద్ధుడైనట్లు గోచరించున్నదే - ఎంతటి
చపలచిత్తుడు! కానిమ్ము...క్షాత్రకుల సంభవుడైన రామ

చంద్రుని నుక్కడించి ... విజయోద్ధంగా ప్రయోగించదగాక - [ఆలోచనా పరంపరలతో అటూ యిటూ తిరిగాడు] ఏమిరా నా వెర్రి! రాముడు...భోగలాలనుడు కావచ్చు - సాధు మాంసాదులకు దానిస కావచ్చు - కాని...భూజానికి సాధుడు గదా! భూతల సాధుడైన రావణ వద్దకే... తాళిగట్టిన మగంటుగదా! నాకు అల్లుంటుగదా! ఎటుల సంహారింతును? ఎటుల వరిష్కరింతును? [చేతిలో మరో చేయి పిడికిలితో గుద్ది...తీవ్ర సంక్షోభం చెందాడు.]

ఎంతటి ధర్మసంకటము ప్రాప్తించినది! ఎంతటి ధర్మ సందియము సంభవించినది! ఏమి చేయుదును? చూరకుంద మన్న...యీతడు నన్ను పుడికించుచున్నాడే - తెగటార్చ్చద మన్న...కన్నకూతురు మెడలోని వసువు తాడు తెంచిన కసాయివాడి నగుదునే - ఇప్పుడేమి చేయవలె? ఓయీ అల్లుడా! నిన్ను చంపుటకంటే...ముందుగా నాలో జ్వాలా జ్వలితమైన కోపోద్రేకములను...చంపుకొనుట మంచిది. అందులకే నిన్ను విడిచిపెట్టుచున్నాను - పోయిరమ్ము - [అంటూ గబగబా వెనక్కితిరిగి వెళ్తుంటాడు- ఏవో నవ్వులు విని...ఆగిపోయాడు.]

[ 7 ]

నవ్వరా! నవ్వు ... ఇంకా పెద్దగా నవ్వు - ఆకాశం బ్రద్దలయ్యేలా... భూదేవి దగ్ధమయ్యేలా నవ్వు - విన్నావుగా సీతా! నీ మగని మాటలు? వింటున్నావుగా ... నీ పిచ్చి రాముని వున్మత్త ప్రలాపంబులు - మృత్యుపాసన్నమైన నీ భర్తను కాపాడటానికి ... ముక్కోటి దేవతలకూ శక్తిలేదు జానకీ! ముహూర్తము నిర్ణయించి - మృత్యుగర్భంబులో దాచిదగాక - [అంటూ నాలుగడుగులు వీరోచితంగా నడిచాడు.]

ముందుకుపోతే నుయ్యి ... వెనక గొయ్యిలావుండే జీవితము- ఏమిచేయుదును? ఆడది కన్నీరుపెట్టిన - అచ్చిరా దందురే - సీత పుట్టినప్పుడు - నేలమీదపడి కెవ్వున అరిచి నప్పుడే ... లంకకు ముప్పువాటిల్లినది - ఈమె యింకనూ - ఏడిస్తే ... ఆ కన్నీటిసెగలకూ - పొగలకూ ... యింకేమి జరుగునో - సీతా విలపించకు - ధనకనక - వస్త్రవాహనాదులతో నిన్ను అత్తవారింటి కంపుదును - కన్నమురులు తీరని నిన్ను కడగండ్లపాలుచేసి... నాలో నేను- దహించుకు పోవుచున్నాను సీతా! కానీ ... కాని... నీరాముడు... నీలమేఘశ్యాముడు... అయోధ్యానగర దేవుడు... ప్రేలుతున్నాడు - మాటలు తూలుతున్నాడు- చెప్పుసీతా! నీవు చెప్పు! సత్యం-

నీవు చెప్పు - శీలవతివి ... పుణ్యవతివి... నిజం నీవే చెప్పు -
కళ్ళుమూసుకుపోయిన ఆ రాముణ్ణి - ఒక్కసారి కళ్ళు తెరిచి
తడిసిన గుండెల్లో — పొంగీ - పొరలి - పారే మమతాను
రాగాలను చూడమని - నీవైనా చెప్పు జానకీ!

ఆహా! బుధులు చెప్పిన వాక్యములు వ్యర్థములు
కావుగదా! సీత పుట్టినది. లంకకు చేటువచ్చునని - నిక్క-
వమే గాబోలు - చావు అనివార్యమే కాబోలు. మృత్యు
వాసన్నమైనది కాబోలు - ఈ సర్వసౌభాగ్యాల కలితుండైన...
సార్వభౌముడు - రావణుడు ... నేటితో కాలగర్భప్రవా
హంబులో కలిసిపోవును కాబోలు -

సీతా! ఎంతపనిచేసితివి! కన్నతండ్రిమీద కాలు
దువ్వుతున్న భర్తను - ఒక్కమాట అనలేకపోవుచుంటివి!
మామను మారణహోమం గావిస్తానని - శపథంతో - చపలుడై
ముందుకొచ్చే మగణ్ణి - వారించ లేకపోవుచుంటివే -
ఎంత నిర్దయ! ఎంత నిరంకుశత్వం! నేను తలచుకున్న - నీ
మగడు - నిముషంలో నేలగలిసిపోవునే - నేను గదాదండము
ఝుళిపించిన - శ్రీరాముడు గడగడలాడి...వారధి దాటి పారి
పోవునే - నీ పసుపుకుంకుమలు కదిలంగా నూరేళ్ళు పచ్చగా
వుండవలయునంతలంచిన నన్ను మృత్యువు కప్పగించ నిచ్చవడే_

నీకు సుఖంలేదు సీతా! శాంతిలేదు... నిన్ను నీవే నిలువునా దహింపచేసుకునే తరుణమాసన్నమైనది - క్షమాపణలేని నీ పాపములు- నిన్ను అవనిలో కలవకమానవు- అనుభవించు- రామచంద్రా! సన్నద్ధుడవుకమ్ము రమ్ము- రామరావణ సంగ్రామంబున విజయులెవ్వరో—లోకము తీర్పుచెప్పును-రమ్ము-రాచుకొమ్ము— [అంటూ మెళ్ళో పులిగోరు...తీసి ఒక్కసారి కళ్ళకద్దుకుని... ఒక్కదూకున వెళ్ళిపోయాడు- గలగల ధ్వనులతో తెర మెల్లిగా జారిపడింది]

—: సమాప్తం :—

# గాజుల గాలిబు

[ఆదిపల్లెటూరు - నాలుగు రోడ్లు కలిసేచోటు :—
గాజుల గాలిబు చేరాడు - పిలిగడ్డం - కుచ్చుటోపి - కళ్ళ
లుంగీ — కళ్ళలాల్చీ - కళ్ళకు తెల్లనికళ్ళద్దాలు - చేతిలో
చిన్న సంచీ - తమాషా నడక - గాజుల గాలిబు అభినయ
ములు]

గాలిబు: గాజులోయ్ - గాజుల్! ఆడపడుచు
గాజుల్! ఆడబిడ్డ గాజుల్! చిట్టితల్లి గాజుల్! పిల్లరకొట్లు
ఒట్టెమ్మ గాజుల్, సవితితల్లి గాజుల్ - సౌభాగ్యవతి గాజుల్
ఆడదన్న గాజుల్ - పుణ్యవతి గాజుల్, దేవత గాజుల్, మాతృ
దేవత గాజుల్ - సంసారం గాజుల్ - సంతానం గాజుల్ -
సంకురాత్రి గాజుల్ - కల్పవగాజుల్ కల్యాణి గాజుల్ - సిరిసిరి
మువ్వ గాజుల్ శివరంజని గాజులోయ్ - గాజుల్ - [కొంత
దూరం నడిచాడు- ఎవరో పిల్చినట్లు ... కళ్ళద్దాలు పైకె
నెట్టి ... చూశాడు] గాజులోయ్ ... గాజుల్ - జయశ్రీ
గాజుల్- జయమాలిని గాజుల్ - వాణిశ్రీ గాజుల్ - వవ

జాక్తి గాజుల్ ... గాజులోయ్ గాజుల్ - (మళ్ళీ నాలుగడు
గులువేసి - వెనక్కి తిరిగాడు]

తొడిగించుకుంటారు హమా? గుత్తంగా తొడ్గకపోతే
గొంతు పట్కోరు హమా నాక్కీ? కొత్త కొత్త గాజుల్ - తాజా
తాజా గాజుల్ వుండాయి హమా? పెళ్ళికూతురు హేమ్మా
హాంది! శోభనం రాత్రి) గాజుల్ కూడా - మేరా సంచీలో
వుండాయి - కావాలి క్యా? అదీ హేమ్మా భాత్ హాండి! హాక్కీ
సారి—నాక్కీ గుత్తంగా తొడ్గిపోతే... బల్మలో యింకోడినెల
తొడిగించుకుంటారు క్యా? నై నై...నాకీ అబద్ధం చెప్తానుహా డీ
మీక్కీ? ఆ కనకయ్యగారి భార్య లేదూ హాండి... కాంతమ్మ
గారు...ఆమెడ్గి తెల్సుకోండి - సిన్నప్పట్నుంచి నాక్కీ తొడ్గ
తుండాం - ఇంతపిల్ల అప్డు నాకీ యింతవుండి క్యాం - ఈడు
వచ్చేతలిక... నాక్కీ మీసం వచ్చివుంటాది - ఆమెక్కీ శాదీ
అయ్యేతలిక... నాక్కీ వాక్కి పిల్లపుట్టి పోయింది - అసలిక
పెళ్ళినాడు... ముందుగా నాక్కీ తొడగలేదుహమా గాజుల్ -
మోచేతి మట్కు తొడ్గిందాకా నాకా విడ్చిపెట్టినాక్యా హమా?
నైనై... జైలోరా బేతా అని నాక్కీ కొడబట్టి... పర్మటింటో
కూకోబెట్టినార్ - (ఎవరో రావడం గమనించి - చికిలించాడు]

రంగమ్మగారూ! హేమ్మావమా ... చీపురు
పుల్లలా ఐపోయినార్రు? తుంకుముక్కలాగ వుండలేదుహమా
మీక్కీ? హేమ్మా... ఆపరేషన్... కైకూహాండి? బిడ్డల్ పుట్ట
కుండా - చేయించుకున్నార్? అరే అల్లా...అల్లా...గొడ్డు
బోతు నా కొడుకులంతా... బిడ్డల్ కోసం - గడ్డవల్లుల్ పెట్టి
చవ్వుతుంటే - మీక్కీ హేమిటి ఖర్మొచ్చిపట్టింది హాండి! ఆపరేషన్

చేయించుకోటానికి? కొండలాటి మడిసి...పిండంలాగ తయి
పోయినాడ్ర్- కర్మగాపోతే హేమిటి దివ్వండి? ఇంతమట్టు-
కోణీ తగిలై హాండీ-పొద్దునే...యాద్వానా తొక్కు- ఎద్రూ
వకితాక్కడు- పైతాబోణి గాలిను...(అంటూ ఇంకో చోటికి
వెళ్ళాడు] గాజులోయ్...గాజుల్—

సాయిబూ! హేమిటీ ఖమ్మా? మరేద గిరేదలేకండా-
అమ్మా నాన్నా పెట్టున్న పేరు... లేదూ హాండీ గ్యాను
ద్దుల్ హాండీ! పేరు తెల్వకపోతే..."ఇద్గో బాబూ! అబ్బాయ్-
గాజులబ్బి - తెల్పోతే— గాజుల్ మడిసీ" అని పిల్వాలేవూ?
మొఖం సూడు... మొఖం... దున్నపోతు మొకం- ఎప్డూ
చేస్కుంటాడు హామా నీకి? గాపతం చేస్తావ్? మురికాళ్ళ
మీద నడుస్తావు ది సూడు... ఎద్దుమూర్ఖ-మడిస్ - [మరో
చోటికి వెళ్ళాడు] ఆదీపిల్ల- మీక్కీ అందంగావు దిక్కారూ?
హచ్చాగా పిల్చి స్తారు? మన్సు కదిరింది- హాక్షా నిల్చివుంది
సూడండి- పర్వతంలాంటి మడ్సి-సాయిబూ హంటాదేమిటి
హాండీ? నీకి పిల్వాలేదూ- మరేదగా-

రేటుదేముందిహాండీ? మాట కల్వాలిగాని... ముందు
కూర్చోండి- సైజు పూసుకుందాం - అరే...ఎందూ-లేవు
హాందీ- మొహ్మ గదూపవా - మీ తల్లికితొడ్గి పోయ్యిండీ?
అమ్మ ఖుర్శీ లేదూ గ్యా? పొలం ఎల్లిన్యారూ? ఘుర్బానా ఖీ
లేరు గ్యా? అట్టా సెప్పండి- అది హేమీ ఖాత హాండీ -
అచ్చం మీ యున్నటి ఆడపిల్ల ల్ కేలియే... సీసం అంటి
గాజుల్- తెచ్చిన్యా - బైటో...బైటో...గ్యా మడిస్హాండీ
ముందుగా రేటు కై వా హాండీ! సైజు దేఖినై- నరుణ దేఖినై-

నాకీముందుగా సెప్తాదూవాండి? హేమిటి? జయశీలగారా? అచ్ఛా అచ్ఛా! మధురమైనపేరు...గవర్మెంటువారి సందు లాటిపేరు...దేఖోహాండీ! నాకి తెల్వక అడుగుతాను... తమరు యిక్కడ వుంటల్లేదూ క్యా? అట్లాసెప్పండి... మద్రాసులో హేమిటీపని? సిల్మాలో చేరటానికా? క్యా... మంచిబేరం తగిలిందివమ్మా! మంచి భాత్ చెప్పినారు - అసల్కి నమ్ముతారో... లేదోగానీ... జయశీలగారూ... ఈముద్దైన... "జయ" అని రెండచ్చరాలు పేరుముందు తగ్గించుకుంటే... మోతమోగిపోతుంది అనుకోండి జాతకం - ఝూం ఝూంన ఎల్లిపోటమే - ఆకాశంలో తారలాగ -

దేనికి అయినా... స్టారు వుండాలి మామా! క్యా ఆదీవాండీ మీరాకి? ఈ గజల్ గాలీబుగారు... గాడె కొడుకు అనితల్చినారు క్యా? నైనై... నాకి మద్రాసులోనే బతికినాను... మొన్నటి మటుకు - కైకూ హేమిటి? సిల్మాలో చేరటానికే - అరే అల్లా! సీవురుపుల్లల్ అమ్మ సిల్లరమల్లి అని తెల్చినారు నాకి? అరే... అయ్యారే... రేరేరే... ఎందుకూహాండీ... గుక్క తిప్పుకోకుండా నొవ్వుతారు? ఆగండి జరా! అల్లా అల్లా! పేణం బేజారైపోతా వుంది శీలాగారూ! జరా ఆపండి అంటేను — ఎందుకు హేమిటీ నా తల్కాయ్? జమున నచ్చిందీవామా యిట్టా? జానకి నచ్చిందీ? జయంతి నచ్చిందీ? వాణిశ్రీ మటుకి... నచ్చిందీ క్యా? అల్లా దయసూడబట్టి... జాతకం తిర్గబడింది - జాతిరత్నం మాదిరి ఎల్గుతూంది

దేఖో జయశీలగారూ! జమునహూలిని వుంది చూశారూ? పక్కనప్పుడు సూడాలండి - ఎగ్రెత్తిపోటమ్మ

గదండి... మగనా కొడుక్కల్ – అమ్మతోడు – అస్మంటి జాతకం వుందిహాండీ మీాకి? ఇంకో యేడు గడ్సిపోతే... మళ్ళి మాంచి యాకుమీాది కొచ్చిపోతార్ – అప్పుడుహాండీ ... బేతాలు మాదీ ఘర్ ముంకు కుక్కల్లా పడొక్కగానాండి? బుక్కుసెయ్యటాన్కి? జగా కెయ్యిసావువయూ! అరేతూ ... క్యా మడ్సిహాండీ మీాకి? గజాల్ తొడ్గేవానికి ... కాదుహాండి... జాతకం సూసి సెప్పతాను నాకి? కొంచెం కొంచెం మాలుంహాండీ – అయినా మటుక్కు... జయశీల గారూ! మద్రాసు నగరంలో మజిలీ వున్న తెల్గుబిడ్డల్ ... అందర్కి జాతకం తెల్సహాండీ – ఏదీ... హాత్ సూపండి – [ఆమె చేయి పట్టుకొని... ఆనందపరవశుడై ... పిల్లిగడ్డం సవరించుకొన్నాడు కుచ్చు టోపీ... విదిలించి మళ్ళీ పెట్టుకున్నాడు.]

వ్వా! వ్వారేవ్వా! ఇస్మంటి మంచి హాత్ ఎవర్కి వుట్టిందీహామా? ఎంత మంచి సెయ్యి!... వెయ్యి రూపాయాలు ఖర్చు బెడితే... వుట్టుద్దీహామా... యిది సెయ్యి? ఇక్కడ చూశారూ... ఇది... ఇది హాండీ ఆసల్ది... అసల్ది హాంటే... క్యావో? రవి స్థానంహాండీ – నీకి హాత్ మే... యింత పొడ్గావుంది వమా? ఇంతమటుక్కు ఎవుర్కి సూపించలేదూవమా నీది? అల్లా తల్లా – ఇస్మంటి రేఖ వున్న సెయ్యి దొర్కితే హామా... వదుల్తారూ? బేతాలు అదీ తెల్వదువమా? జ్యోతిష్యం దెప్పే నాకొడుక్కల్ –

అసల్కుమందీ సిత్రమైన బతుక్కుహాండీ – మూాడు సమత్సరాలు జటక్కుబండి తోలానుహాండీ! మానెయ్యక పోమిటి చేయ్యమంటార్కి? గుర్రం పరుగుదీస్తే... అరే

సాయిబూ... మెల్లంగా పోనీరా... కాళ్ళు పట్టుకుంటాం - అంటారు నాకీ - దానా చాల్కు... గుర్రంగవుకు మెల్లంగా నడిస్తే... క్యారే గలీబూ... బుద్ధి గడ్డితిని... నీది బండి ఎక్కినాక్యం - వుసూరుమంటూ నవ్వుతావేమిటీ గుర్రాన్ని? అంటావు... వుసూరుమొకం నా కొడుకుల్ - నేయాం మీరాకి సెప్పండి హామ్మాగారూ! ఎనక్కి జర్గమంటే ముందుకి జర్గుతార్ - ముందుకి సర్దుకోండి సాబూ అంటే... ఎనక్కి జర్గి కూకుంటార్ — కైసా కుదురుద్దిహాండీ బేలన్సు అందుకని ... రోశబుట్టి ... గుర్రాన్ని బండినీ... అమ్మిపారేసి... గాజుల్ బేరం చేసుకుని బతుకుతున్నానుహాండీ! క్యా నామురాద్‌హాండీ? ఇస్మంటి అదృష్టం బతుకు... ఇంకోరికి వుందీహాండీ? ఎస్మంటి సేతుల్ పట్టుకుంటాను? గాజుల్ తొడక్కడానికి? బహుత్ కుషి బతుకు కాదూ హాండీ యిది?

కొత్త పైసా తక్సేతే... పట్నంలో పల్కరిస్తారు హాండీ? క్యోంనాడా... ఇదే బిజినెస్ చేస్తున్నాను - హాంకు హేమిటీహాండీ? జయచిత్రకు తొడ్గాను — జయసుధకు తొడ్గాను. జయప్రదకు తొడ్గాను - హాంట్కి రెండు మూరులు... జయమాలినికూడా తొడ్గాను గాజుల్ — మీరూ... యిప్పుడికైహాంటే... తొడ్గిపోతాను - దేఖో జయశీలగారూ! అడ్వైరాముడు సిల్మా చూడలేదూ? హాందులో జయప్రదకు గాజుల్ తొడ్గింది... ఎవ్రని? నాక్కాదూ హామా? రామసిలక దేఖినై క్యా? వాణిశ్రీకి తొడ్గిందీ... యీ గలీబు కాదూ హామా! హాంక్కి హేమిటిల్గాం... షాహసవంతుడు - నా వానగాళ్ళు - అదృష్టవంతుల్ - అందాల

యిద్యా పనులు సెయ్యటం ... నాకీ సుట్కాయిష్టం
అనుకున్నారు క్యా? నైనై - పనీ గజ్యాలా అంటే...
చూసీ సూడనట్టు పోవాల - దిక్కుదిద్రలేదు నీకి - ముకొక్క
మూసాక్కని... కూకుంటే... ముసలితనం వస్తాది హాండీ...
ముందుగా - యేసెం ... గీసెం... అధీ నై - జరా ముందు
సూపు వుండే ఆడమన్సి... ముగ్గుమీద నిలబడ్తది - హాంకి)
కన్నా ముందుగా - పైకి ఎల్తాది - ఎంతసేపుహాండీ? ఐదు
నిమిషాలు - డబ్బాదస్కం పెడతారు నిర్మాత సాబు -
ఆయన హాంక్డా - డైరెక్టరు సాబు హాంక్డా - రంగులువులిమే
మేకప్ సాబూ హాంకడూ - గుడ్డల్ కుట్టే ఆద్మీ హాంకడూ
డ్యాన్స్ చెప్పేవాడూ... డ్యాన్స్... అతనూ హాంకడూ...
పొబ్లిసిటీ మేనేజరు సాబుహాంకడూ - ఈళ్ళుహాండీ ముఖ్యాం

మన్కీ యేశంకావాల - ఆళ్కీ మందీ యేసెంగావాల -
మన్కీ పేరు రావాల - సిల్మాతీసి నంద్కా ఆళ్కీ మంచిడబ్బు
రావాల - ఈ లోప్ల... హాంక్తా హాంక్డా ... ఎక్కుతారు
హాండీ మందీకువ్వు - ఏక్ దఫా - దో దఫా సూస్కుంటారు -
అన్కతిస్కుంటారు... అప్పుడు మా వాలి మాటుండీభోగం
కాలుకింద బెట్టిస్తారు క్యా? నై నై... అంతాలోప్లే - లోప్ల
లోప్ల జర్గిపోవాల్సిందే -

కారులోప్లహాండీ .. కారులోప్ల - దిగటానికి తీరిక
వుండదు... ఎక్కటానికీ తీర్కవుండదు - అందులోనే రంగు
పూసుకోవాల - అందులోనే డ్యాన్స్ నేరుస్కోవాల అందు
లోనే... సీరవిడుసుకోల ... అందులో సీకటైతే ... -

ఒక్కసారిగన్క పడిపోతే. .మందీపేగం .జరాగా! కిందవున్న
మనిక్క...పైకిపోతాం - పైనకూకున్నవాళ్ళంతా కిందిక్క
పోతారు - కిందిక్క అంటే తెల్యాద్ హామా? మేడమీదనుంచిక్క
నుంచుంటే - మేడకింద ఆళ్ళు నుంచోవాల - దీసిబ్బొబతుక్క
అసల్క... మద్రిబక్కటానిక్క... మద్రాసుపట్నం లో...
మంచియీలు వుందిహాండీ! గుడ్డవల్లకండా...డబ్బుల్ సంపా
దించవస్సు. సెమట పట్కముండే...సేతికి పైసా దొర్కపోద్ది-
మారాజులా బత్కవచ్చు - మారాజులా సానమూవచ్చు -

ఎందుక్క పోనుహాండి? నాల్గురోజుల్ బేరాలు
చూసుక్కంటాను హామా...ఆనక ఎల్లిపోతాను... హెక్కావుండ
బుద్ధి కాటంలేదుహాండీ! ఈక్కబత్కు ఇది- చచ్చిపోయిన
అద్మి ..సావుకారిలా బత్కకాడుగదూహాండీ అక్క? అక్కల్లు
హాక్కావుండి - మళ్ళీహెక్కా బత్కలంటే- ఆల్లాదిగివచ్చినంత
పని అవుతుందినాకీ -

జరాపొర్పాటు జరిగిపోంది జయశీలగారూ నాకీ -
అందుక్క తెగ్గి గాజుల్ తగ్గించుకని...పల్లెటూరుపడ్ని పడినాం
ఎందుక్క హేమిటి శీలమ్మగారూ? పాండీబజారు లేదూహాండీ?
లండాచోరు ముండాకొడ్కుల్ అంతా క్కా -దూహామా
మజిలీ-రెక్కల్ తెగిన పచ్చుల్లాగ... చెట్టుకింద నిల్చికవుండయా
హామా! అదీ పాండీ బజారు ... నాకీదోస్తువుండినాడు -
వుత్త యాదాస్త మడ్సిహాండీ - బేకారాద్మి - సిలకల్ని పట్క
రమ్మంటాడు - మాటల్ సెప్పే సిలకల్ని - ఒకనాడు హామా..
గుంటూరునుంచి... హూకీ పంచరంగుల సిల్క ఎగిరి..
మద్రాసులో వాలిందహాండీ - తస్యాదియ్యా ... అది మంది
సితిక్కసిక్క ... మంచి చేసుకుండినాం...మాటల్ సెప్పాతుండి

న్యాం - మరేద తిరిగేవాడికి...చాలా చాలా కల్యుల్ చేర్చి
వుండివాణ్ణి - నీకిదో షుకి అప్పగింది న్యాం - బస్ హా...
బస్...యేసెం వచి వశింది...కాళ్ళ ముందర - సెటర్లో
కూకుంటే...గంటకోసిల్క...ఎగిరి...భుజా మీన వాల్తాయి
గానీ...చిన్నతనం కాదూహమా? ఎర్గివున్నవారు చూస్తే
ఏమీ అనుకుంటారు- ఇస్మంటి యాద్గార్ కొదుక్లిన్ని యింటి
ముంద్రక...రానియ్యకూడదమా అనుకోరుకాండి-? అండ్ల
తిర్గు మొఖం పట్టాను -

కైసాహాండీ? నాకీ గజల్ అమ్మాకనిబట్క
యాపారం - వంటినిండా అందాలు వూసుకని...ఎండా
మొఖం కూడకుండా ఘుర్కవుండే ముద్సనికి - నాకీ యిద్దరు
బిడ్డల్ తండ్రిని - కీకీ...యింతమట్కు కాధీభీకర్ హై! కైసా
బోలోహామా? పేణం వుంటాదిహాండీ? వూపిరివుంటే వుర్సా
గల్లు అమ్మాకబత్కవచ్చు గాని...ఇస్మంటి లంచ్చాపటచెయ్య
టం తప్పు కాదూవమ్మా? ఎవ్డూ అయినా...మొఖం హిత్తా
కూసేదాని...యీలు వుంటాదీకా? అల్లా అల్లా!
బేజారు కాదూవమ్మా...బతూక?

తిక్కూకానాను జ అమ్మగారూ! తర్వాత జర్గేది
హేస్తాం అది? పెళ్ళాంది లడ్కని...ముంచేసినాడు - తేవ
దీసుకపొయ్యే...పగాన్ను తీసేసి - నష్టప్పు తోసినాడు..
పాయిబుర్దోడూ...మీరా బాబు...కేసు పెడితే...నాకీ బతూక
హేమిరా పుడుంది? బోలో - ఖరీదైన బతుకు అంతా...
కరాబయ్యింది చెప్పారేబేటా - అది లోకం వద్దుకావుంటే -
కటకటాల్లో ...ఏష్టడం తప్ప ... రెక్కలు ముగులాడి
హాండీ? గడ్డి మొల్లోంచి మేతదూసి...గొడ్డముందు వేసి

కొండి - మంచీ మంచీ మాటల్ సెప్తా వుంటినాక్ - ఇచ్చాగా ముద్దువస్తావుండినాయరు - నీకి పాటల్ పాడ్తారువాహమా? - అడ్గదీమాట...నీక్కిమాలుం జయశీలగారూ...ఇచ్చా మాలుం కంఠం సూడబోతె కోయిలకంఠం - నుశీలమటుకా బత్కా పోతాడివాహమా...నీకిముందు - లతామంగేష్కర్ మటుకా... నీక్కిగొంతు వింటే...ఎగిరెగంతు వెయ్యమావాండీ? బూటకం సెప్పేదానికా...నాక్కీ...టాలాటోలా మడ్సోయుని తల్చినాకవ్ క్యా? ఈ గాజాల్ గాలీబు కరారుమడ్సి - కరారుమాటల్ సెప్తాడు...కరారుగా బత్కతాడు- తక్సీత్...నాక్కియొప్పుడో సిల్కాయమాక్కేసనై పోనూ వాండీ!

ముందునీకి ... కిందమంది పైకిఎత్తేసాలూవాహమా? తర్వాత నాక్కిఎల్లిపోతాను - ఎల్గదూవాండీ! అసల్కానీకి పైకిఎత్తే...నాక్కిపూరుకుంటాను క్యా? నాష్పుటోకానూ? రెండుచేతుల్తో పటోకాని...అలా అలా...నాక్కిపైకిపోతాను - నీదీపేరు సెప్పోకాని...బత్కపోదువాండీ...యీరా గాలీబుగాడు? నాక్కిమటుకా ఏమ్టిరా తక్వ? పాటల్ పాడ్తాను - నాటకాల్ ఆడ్తాను, మొకంనిండా రంగుపులిమి ... కెమేరాముందు ... నిల్చొబెడితే...అచ్చం రాజబాబులాగ వుండనూ వాహమా! అశకంచేసేదానికా...వాళ్ళక్కి గదూ బహుమతులు గెల్చుకుండినాయం...

జేఖోజయమ్మా! సిల్లరకొట్టుసిట్టెమ్మ సిల్కాతీసేటప్పుడు...నాక్కి సుక్కయ్యయేశం కట్టమని సెప్పినాయర్... సుక్కయ్య తెల్వాద్ వాహమ్మా? సుక్కయ్య...మద్దెరకం ఉడిసి వాండీ...అరే...క్యామడ్సివాహమానీకి? "సూడు బుల్లెమ్మా. సాడు పిల్లడు...పైనపైన పడుతవంటుడు" [రాగయుక్తంగా

పాడుతూ అభినందించాడు] ఇదీ హమారా దేశం - కరాయ చేసి
న్యారు - నాక్కీమన్నరాక...వద్దూ అండిన్యాం- తర్వాత్ ఖా
పాటికి మంచిపేరు...గాంగాంక్కీ...టాంటాం అయిపొయ్యేది
కాదూహాండీ ?

నాదీ గొడ్వయిడ్సిపెట్టండి - మడ్సి అన్నతర్వాత ...
మన్కి నీతివుండ్వాలహమూ - పట్టువుండ్వాల పరువ్తతిన్యాటా
నికి...మన్నవుండాలి - అడ్డునపడి వుండిన్యాం అనుకోండి -
అగాధంలో మునిగివుండిన్యాం అనుకోండి- ఎంతసేపు వుంటాం?
లేచి నిల్చోవూ ? లేగదూడకన్నా స్పీడుగా పరుగుతిన్యా
మూహాండీ ? పేణంకై కూ పోరాడిహామూ ? మానంమట్టుక్కి
ముందుపోయితీరవల - అదిఖాయం - గుట్టుచప్పుడుకాకుండా
జర్గిపోదూవమా ? మూడోకంటిక్కి తెల్సిపోతే ... ముగ్గుదర్గి
పోదూ ? క్యాజోత్తై ? ఏమి చెప్తాడు? చెప్పాద్దున ఎల్లిపోదాం?
ఆరేఅల్లా... ఇంతజూర్ ఐతే...కైసాకిలమ్హా ? ఘుర్మే
నాకి...హూంక్టి...హూంక్టి బోరువుంది - రెక్కల్ [illegible] రెండు
వచ్చిలున్నాయ్-ఖానాపనా కేలియ్...పైసా కూడబెట్టాల...
బత్కేదాన్కి మేత నూపవల ? కైసాహాండీ ? ఇంతమట్టుక్కి
బోణీకాలేదు - సందితెర్వలేదు. గాజుతోడ్తలేదు- కంగిరేడ్డు
లాగ...గంతతగ్గించుకుని ఘుర్ ఘుర్ క్కితిర్గి నాను-మీరాకే [illegible]
మాటల్ యాపారంతో...మద్దినేలగడ్చిపోయింది- [illegible]రేఘూ...
క్యాలద్కి వమానీకి ? తఖరామాటల్ సెప్తే...తల తిన్యారూ
వమా...పెద్దమద్సుల్ ? వొక్టి నాలికవుంది ... వొక్టి మాట
వుంది - బస్-

క్యాజోత్తైహాండీ? క్యాబోల్తు? రెండువందల్...దోనే
దోసేయాత్రియా - ఇష్టా యిస్తార్ ? ఖానాపీనా కేలియే...

ఘర్మా ఇచ్చి రమ్మంటార్? క్యామడ్సిహాండీ మీాకి? క్యామన్సు హాండీ మీాకి? అల్లా మీాకి దిల్లునిండా మంచితనంపోసినాడు మామా? గుండెల్నిండా అమృతజలం నింపినాడు — అమ్మతోడు జమామ్మా! అల్లాతోడు -

సల్లంగా చూసే మాదీ అల్లా...మీాక్కి దోసిలినిండా. మంచి మంచి కోరికలు పోసినవాలె - అచ్చా అచ్చా ఆకీ క్యాసాలు తలమీాద కుమ్మరించవల — [చేత్తో రెండు వంద కాగితాలు అందుకుని...కళ్ళ కద్దుకుని ... లాల్చీ జేబులో దాచుకున్నాడు] వ్వా! వ్వారేవ్వా! మంచి గుణం అల్లా మీాక్కిలోపల వుంచినాడు - ఇస్మంటి దేవత మొకం చూస్తే... యేసెంవస్తా?...వరం అడ్గితే...యివ్వడూ మామా అల్లా? నీకీ ఎవ్వూరి? నాకీ ఎవ్వూరి? నాదీ ఏవ్వూరు? నీదీ ఏవ్వూరు? వాక్కి మంచిమాట సెప్పెతల్కే...మన్సుకి దిరి...రెండువందల్ నాకీ...యిచ్చినార్రు - పట్నం ఎల్లేనాకే తియ్యార్రుగా... నిల్చినార్రు - ఇది అంతా క్యాకాహాండీ? అల్లాదయ కాదూ? ఇలాకనికరం కామా?

వాక్కి దెబ్బకి...రెండు పిట్టల్ అని సామెత యినేదా మామా! అది జర్గితీరవల - ముందుబోణి సెయ్యకుండా - కై పాయల్లం? అని ... అనుమానం వచ్చింది నాకి - కాని దేఖోమమా!...మీాక్కి గుండెమట్కే ... హిమాలయ పర్వతం అంతలావు వుంటాది హాండీ- అమ్మతోడు- ఇద్దో మామా జరా...అటూ యిటూ నడ్సి సూపండి నాక్కి! [ఆమెనడుస్తుంటే...చుట్టూ తిరుగుతూ...తలఎగురవేస్తూ ... కుచ్చుటోపీ ఆడిస్తూ...తమాషాగా ఆనందపడిపోయాడు] అచ్చా- జవాబత్ అచ్చా - వ్వా! వ్వా! నాగు బాము నాట్యం చేసి

నట్టు గుండాదివమా - నీదీనక్క - జడలేదువామా...జడ
రెండు భుజాలమద్దన కద్లాతూంటే ... గుండె ఎగ్రీ ఎగ్రీ
పోయిందివాండీ - పైటకొంగు - లేదు హామా...నీకి నచ్చి
నవ్వాడు...లేసి - పైకి ఎత్తులంటే...మన్ను ... ఆకాశంమీాన
వాలిందివామా - నీక్కీనటుక్క తారచాయిన్నపుడి వాండీ...
తపిసీలు వస్తే...తలబండికింద పెడ్తాను - అమ్మతోడు -

- భీబోలో జయమ్మా! మన్న ఋప్పి బోలో - బహుత్
ఖుషీ ఖుషీ భాత్ బోలో - ప్రయాణంకెబ్బాబ్? ఆచ్చా -
నుబో...అంటే...రేపు? అబ్బా...నాకితయ్యారే - లేకన్నో
పిూది రాకకోసం...పిల్లిలాగ కూకోని ... ఎదూరిచూస్తా
వుంటాను - అచ్చా ఆచ్చా...కల్ శాంగా - అత్తరుపూసు
కోని...అగరుబత్తి ఎల్గించుకోని...బల్లాకి కొబ్బరికాయ ...
కొట్టోక్కని...నాదీజోరు లేదూవమా...జోరు...దాన్కి ఏకో
ముద్దు పెట్టోక్కని...టంచవగా ... యాలవ్రికారం లేకన్నో
వాల్తాను వాండీ - రెక్కల్ గట్టోక్కని రాదూవాండీ!
మాటతఖరావస్తే ... ఎద్మకాలు సెవ్వలేదూహామా ...
ఎత్తు...బస్ - వమ సే...[ంటూ సంచీతీసుకుని...చరచరా
తమాషాగా నడుచుకుంటూ అక్కడినుండి వెళ్ళిపోయాడు -
సన్నని శ్రావ్య సంగీత ధ్వానులతో తెరజారి పడింది.]

—: సమాప్తం :—

# బానిసోడు

[ఆ వూరి మధ్యలో అందమైన మేడ. ఆ మేడముందు ఆస్థి పంజరంలాంటి పుల్లిగాడు నిలబడి వున్నాడు. అతని వయస్సు దాదాపు సలభై నిండాయి. ఎముకల గూటిని కప్పు కున్న శరీరం. ఎప్పుడో ముడతలు పడింది. చిరిగిన అరచేతుల చొక్కా, పైకి ఎగదోసిన పంచె — నెరిసిన వెంట్రుకలలో పెరిగిన గడ్డం, జుట్టు పుల్లిగాడి ఆభరణాలు. అతని మస్థి ష్కంలో మెరిసే ఆశ అతన్ని యింకా బ్రతికిస్తుందని చెప్ప వచ్చు.]

పుల్లి: పుల్లిగాణ్ని దొరా! గూడెంలో గురవాయ్ తమ్ముణ్ణి.

మూడ్రోజుల్నుండి ముద్దెత్తలేదు బాబూ! ముసురు పట్టి. బిడ్డా పాపల్ని ఆకలి కప్పగించింది. వస్తులతో పిల్లలు పడిపోయారు దొరా! గాదె తెరిసేసరికి - నా పెళ్ళాం పిల్లలూ గాలిమేస్తారు బాబూ! జాలి చూపండి. ఆట్టుంటారేం దొరా! పొద్దున్లేచిందగ్గర్నుంచి ఎద్దులాగ, ఎనుబోతులాగ మీ పొలంలో నే చాకిరీ చేశాను గందా! చెమటోడ్చి చవిటి చేన్ని నీళ్ళతో కన్నీళ్ళతో తడిపి రాజనాలు పండించి మీ గదిలో నింపింది నేనేగా దొరా!

కూలిచ్చారా? కష్టానికి సరిపడా ఖరీదు కట్టి, కూలి గింజలు అప్పుడే కొలిశారా? అంతేనా దొరా! అంతమటుకేనా మీ బాధ్యత? నమ్మి బతుకంతా మీకే అమ్మి రేయీ పగలూ తెలవక, ఎండా వానా ఎరక్క తిండీ తిప్పలూ తినక తమ కొట్టాల్లో పశువుల్లాగ పని చేసే ఈ పుల్లిగాడు మీ యింటి కాపలా కుక్కలాంటి వాడు కాదా బాబూ!

అసలు మీ కొట్టాల్లో వుండే గొడ్లుకన్నా తిరిక వుంటాది గానీ - ఈ రెండు కాళ్ళ గొడ్డుకి తిరికే

లేకుండా పండగవాడన్నా ఇంటికాడ వుండకుండా రెక్కలు ముక్కలు చేసుకుంటిని గదండీ !

దొరగారూ ! మీ కాళ్ళకు మొక్కుతాను సేతులెత్తి దణ్ణం బెడతాను శాశ్వతంగా మీ యింటి సుమ్మంలో కాపలా కూకుంటాను ఈ ఒకపూట నా బిడ్డల్ని బతికించండి. పోలెడు నూకలన్నా చెంగులో పొయ్యండి దొరా ! గంజి కాచుకుని తాగుతాం.

నిరుడు కరువొచ్చినప్పుడు వుచ్చుబట్టిన జొన్న గింజలు గూడెంవోళ్ళ కిచ్చారు. వాళ్ళంతా మీ పేరు చెప్పుకుంటూ, రొట్టెముక్కలు చేసుకుని బతికి — ఇప్పటిదాకా మీ చేలల్లో పని చేస్తూనే వున్నారుగా దొరా ! అసలు నేను బాకీ పడనే లేదు గదండీ !

ఏమంటారు ? ముష్టెత్తమంటారా ? లేకపోతే మురిగి చావమంటారా ? ఏం బాబూ ! పనోడిమీద యిశోసం లేదా ? ఈ బానిసోడిమీద అమాత్రం బాధ్యత లేదా ? అర్థాకలితో, నిద్ర కళ్ళతో ఆలూ పిల్లలూ అలో లక్ష్మణా అంటూ మీ ఆకుతోటల్ని బాగు చేశానుగా దొరా ! తవ వంటికి మురికిపడితే

నీళ్ళు తోడి సబ్బుతో వళ్ళంతా రుద్ది కండువాతో
అద్ది వరమటించట్లో పక్క లేసి తమర్ని పండుకోబెట్టి
కాళ్ళు పట్టి నిద్రపోయేదాకా కాళ్ళ దగ్గరే కాచుకుని
కూకున్నానుగా బాబూ !

అవునయ్యా, బానిసోడ్నే ! మీరా పాదాల కాడ
బతికే బానిసోడ్నే ! అడుగులకు మడుగులొత్తి తొత్తు
లాగ, కుక్కలాగ వడివుండే బానిసోడ్నే దొరా !
తమరికి ఆకలైపోద్దని పాసిముఖమన్నా కడక్కుండా
అంట్లు తోమి, యిల్లు చిమ్మి, కాఫీ పెట్టి మీరా నోటి
కందించేదాకా అదూర్దాపడ్డ బానిసోడ్నే బాబూ !
అందుకని కొంగు చాపితే తొంగిచూట్టం లేదామీరారు!
కాదూ ? కాదా బాబూ! మరేమిటి నా మీదావకసి ?
ఎందుకట్టా మౌనంగా వుండిపోయారు ? నా పెద్ద
కొడుకును చదివిస్తున్నాననా ? అదేంటి దొరా ?
ఆచ్చెరం ముక్క తెలవని మాలో వాడొక్కడె పదూ
కున్నాడు. కడుపు నాయకట్టుకుని, ఆకలి రోగానికి
కళ్ళూ చేతులూ ముడేసుకుని కాలీ కాలీ - పేగులు
మాడి మా డొక్కన్ను పట్టిన పేణాలతో వాడొక్కడ్నే
సదివించుకున్నాను దొరా ! వెలికక్కరకొస్తాడని వాడి

అక్కరలన్నీ తీర్చి ఆఖరికి వున్న కొంద్ర నేల మీదాకే అమ్మేసి బియ్యే దాకా సెట్టుకొచ్చాను దొరా! ఈ మెట్టు దాటితే వాడికీ వుద్యోగం వస్తుంది. వాడి బతుకేదో వాడే బతుకుతాడు. అదేనా నేను చేసిన తప్పు? అందుకే మీరు అంతూకట్టించుకోటం లేదా?

ఎందుకని దొరా? అదేమంత తప్పని? కూటికి లేకపోతే కన్నబిడ్డను చదివించుకోగూడదంటారా! మీ వాళ్ళ దగ్గర పడివుండే బాకీపోళ్ళు చదూకోటమే తప్పా?

అర్ధమయింది దొరా! బాగా అర్ధమయింది. ఇంత కాలం నేను చేసిన చాకిరీకి, సేవకి కన్నీళ్ళే ఖరీదని యిప్పుడే తెలిసింది బాబూ!

ఆ మాటనకండి దొరా! పుట్టిన తర్వాత, బట్ట కట్టిన తర్వాత ఈ చేతులు మీ చాకిరే చేశాయి బాబూ! ఈ వళ్ళంతా మీ ఉప్పు పులుసు తినే బలిసింది. నేనేకాదు దొరా! నా పెళ్ళాం పిల్లలూ కూడ మీ మాటకే కట్టుబడి, మీ చాకిరీకే యిట్టబడి

యింతకాలం కాలం వెళ్ళబుచ్చాం దొరా! కాదని మీరన్లేదు!

కాకపోతే నా పెద్దకొడుకు ఒక్కడే మీ గొడ్డు కాయటంలేదు. వాడొక్కడే మీ యింటో అంట్లు తోమ లేదు. వాడు ఒక్కడే మీ అడుగులకు మడుగులొత్త లేదు. అంతేగా బాబూ! అంతేగా?

ఏమంటారు? వాడు పెరిగి పెద్దవాడైతే మీ పెద్దరికానికే ఎసరు పెడతాడా? లేదు బాబూ! అటువంటి యదవపనులు వాడెందుకు చేస్తాడు? వాడసలే నోరు లేనివాడు. పదిమందిలోకి వస్తే ఏం మాట్లాడాలో తెలీనివాడు. వాడికి మీరంటే ఎంతో భక్తి దొరా! ఎంతో ప్రేమ!

అదేంటి దొరా! నారిగాణ్ణి! మొగరానికి కట్టేసి పగ్గంతో వళ్ళంతా వాచేలా కొడితే వాడు నోరత్తాడా? కందిచేలో ఎంకిని మరుద్దెట్టుకుంటే, దాన్ని సావిట్లోకి పిలిపించి నందేలటవ్వాడే చెరిచి, అవబగించి యీధిలోకి నెట్టేస్తే వాడు నోరెత్తాడా?

అంతదూరం ఎందుకుదొరా! పోలిగాణ్ని ఏం చేశారు? పేణాలు తీశారు - ఆ శవాన్ని కాలవలో తోసేశారు. ఆపైన నా కొడుకు నోరెత్తాడా? లేదు బాబూ! వాడు గ్యానం కలిగినోడు — పెద్దంతరం, చిన్నంతరం ఎరిగినోడు. అందుకే దొరా! నోరు మూసుకుని వూరుకున్నాడు. ఏమిటీ? వాడు మీటిం గ్లు పెడుతున్నాడా? వూళ్ళో కుర్రాళ్ళందరిని కూడగడుతున్నాడా! కూలిజనాన్ని రెచ్చగొట్టి - సంఘాలు పెడుతున్నాడా? దొరగారూ! వాడసలు మీ జోలికి రాడులేబాబూ! మీ మీకు ద్రోహం కలిగించనోడు.

ఏమిటి! వాణ్ని యిప్పుడైనా మీ యింట్లో జీతం పెట్టుకుంటారా? వాడి జీవితాన్ని తాకట్టు పెట్టుమంటారా? కావాలంటే ఎంతయినా వట్టుకు పొమ్మంటారా? వద్దు బాబు! అంత కోపం మీకొద్దు - అయ్యగోరూ! మీదగ్గర చేసిన బాకీలు కోసం.. మయ్యచేసిన చాకిరీ చాల్లేక - నేనిప్పటిదాకా చేసినా

ఆ బాకీ తీరలేదుగా దొరా! మళ్ళీ పాతబాకీ బంధానికే కట్టేయమంటారా? వాడి వంటంటి బతుకును - కొట్టేద్దామంటారా? లేదు బాబు! అలా జరగటానికి వీల్లేదు.

ఏమిటీ? నన్ను పైకి రమ్మంటారా? ఆదేంటి దొరా నేను పైకి రాకముందే - తమరే కిందికొస్తే మంచిది. ఆ హ్హా! (అంటూ చెంప చేత్తో పట్టుకున్నాడు - బాధగా మూలుగుతూ) కొట్టండి దొరా! ఇంతకాలం కడుపుకొడితేనే మాట్లాడలేక పోయాను. ఇప్పుడు చెంపమీద కొడితే యింకేం మాట్లాడగలను దొరా! అయ్యాగోరూ! ఆ మాట మాత్రం అనకండి. యింకెంతకాలం సయించమంటారు? ఇంకెన్నాళ్ళు ఈ బానిసబతుకు యీడవమంటారు! లేదు దొరా! నాలో సహనం చచ్చిపోయింది, ఓదార్పులేని జీవితంలో - ఓర్పు లేనేలేదు బాబు!

ఏమంటారు దొరా! ఒళ్ళు బలిసిందా నాకు కళ్ళు నెత్తిమీదికొచ్చాయా? (నవ్వాడు ఏడుస్తూ) ఎంత మాటన్నారు దొరా! నా గుండెలు చీల్చి

చూడండిదొరా! మీ కోసం గుడికట్టి వుంచాను.
హృదయాన్ని ముక్కలు చేసిచూడండి బాబు! ఆ
ముక్కల్లో మీ ముక్కూ ముఖం వుందో లేదో తెలిసి
పోతుంది దొరా! యిప్పటిదాకా యీ శరీరం మీది-
మీ వుప్పూ వులుసూ తిని బతికింది- తమర్ని బతికిం
చింది. కాని దొరా! యిక నేనూ ఊడిగం చేయలేను.
అబ్బా! (అంటూ వళ్ళీ తెంవ చేత్తో పట్టుకున్నాడు.
పెద్దగా అరిచి)దొరా! మీరు తొందరపడుతున్నారు?
అసలు నేనే-తప్పుచేశానని- తెప్పతీసుకొని దెం వమీద
కొట్టారు? నోరెత్తడమే తప్పయితే యిక నాలాంటి
బక్కచిక్కిన పేదోడు నోరు తెరిచి బతికేదెవ్వడుదొరా?
నేను నాయకుణ్ని కావాలని రాలేదు బాబు! నా
కొడుక్కీ ఆ వుద్దేశ్యం యింతవరకూ లేదు

ఏమిటీ? సగ్గాలు తెచ్చి నన్ను మొగరానికి కట్టి
కాట వలిచేస్తారా? అయినా నోరెత్తగూడదా?
ఎందుకని బాబూ? మీరు మమ్మల్ని బ్రతికించారా
యింతకాలం? గిద్దెడుగింజలు అప్పిచ్చారా? అలా

పిల్లల్ని ఆదరించి కడుపాండ్చినప్పుడు పిడికెడు మెతుకులు పడేశారా? ఎందుకు కొడతారు దొరా?

అవును బాబూ! ఇప్పుడే కళ్ళు తెరిచాను. ఇప్పుడే నాలాంటి కూటికి లేనివాడి బతుకు గురించి ఆలోచించాను. ఈ బానిస బతుకు ఎంతకాలం మోయాలో - యింకెంతకాలం మా చెమటతో మీ చేలన్నీ తడిపి, బంగారం పండించి, మిమ్మల్ని బాగుచేసి భవనాలు నిర్మించాలో అర్థం చేసుకున్నాను దొరా!

అందుకే దొరా! ఈ బానిసత్వం నుండి బయటపడి మనిషిలా బతకాలని నిశ్చయించుకున్నాను. ఆగండి - ఆ చెయ్యి దించండి! దించండి ముందు! మళ్ళీ నా చెంపమీద ఆ చెయ్యి వాలితే నాలో గడ్డకట్టుకున్న శాంతి - సహనం ఒక్కసారిగా చిట్లిపోతాయ్! మీ పరువూ మర్యాదా బజారులో పడిపోతయ్ గుర్తుంచుకోండి.

అవునయ్యా! ఎంతకాలం పడివుండమంటావ్! నా తండ్రి చేసిన అప్పులోనా - నాకు బతికినంతకాలం - బా

డుగ ఎద్దులా చాకిరీ చేశాడు. కాని అప్పు తీరలేదు. ఇంకా పెరిగింది. నేను పెద్దవాణ్నయి ఆ అప్పు తీర్చడానికి బతుకంతా అర్పణచేశాను. అంతేకాదు దొరా! కాగులూ, బిందెలూ, కావడిపెట్టెలూ, ఇనప్పెట్టెలూ మీ ఇంటికే తోలాను. కనీసం వడ్డీకి చాల్లేదు. మళ్ళీ నా బిడ్డలిద్దర్నీ మీ గొడ్లకాడ పెట్టాను.

అయినా అప్పు తీరలేదు దొరా! అంతంలేని బాకీలకు ఆసాంతందాకా చాకిరీచేసి కూడు లేక కులసతుల మానాభిమానాలు మార్కెట్‌లో అమ్ముకోవడం నాకిష్టంలేదు. అందుకే పోతున్నా - మీ యింట్లోంచి వెనక్కి పోతున్నా - తరతరాల బానిసత్వంనుండి బయటికి పోతున్నా. అబ్బ! (ప్రాణం సుడిపడినట్లు బొలికలు తిరిగిపోయాడు. ఆయాసంగా మూలుగుతూ మళ్ళీ మామూలుగా నిలబడిపోయాడు) దొరా! కొరడాలతో కొట్టి ఎన్ని అవమానం చేసినా యిక మీ ఆడుగులకు మడుగులొత్తే కాలం గతించింది బాబూ! కాలంమారింది. చట్టం మారింది. మీలాంటి భూస్వాముల దౌర్జన్యాలు అరికట్టి, హింసాకాండలు ధ్వంసంచేసి - నిరుపేదల కన్నీళ్ళు

తుడవటానికి ప్రభుత్వం అండగా వుందిదొరా! నిరాశ్రయులయిన మా గూడెం వారికి - ఆశ్రయం కలిగించి అంతో యింతో ఇప్పిచ్చి - స్వయంకృత జీవనానికి, సహాయపడటానికి ప్రభుత్వం ముందుకొచ్చింది.

యిక మీ దోపిడిలు సాగవు - దౌర్జన్యాలు అంతకన్నా సాగవు - తరతరాల బానిస బాధలకు కట్టుబడి, మీ యెత్తులకు పట్టుబడి - జీవితాలనే మీకు అంకితం చేసిన నిర్భాగ్యులకు - నిజంగా చేయూతగా ప్రభుత్వం నిలబడింది దొరా! ఈ చీకటి జీవితాల మీద వెన్నెల కురిపించి వెలిగించాలని ప్రభుత్వం యెన్నో ప్రయత్నాలు చేస్తుంది.

యిక మేము బానిసలుగా పడివుండలేం. చట్టం మారింది. కష్టాలను గుర్తించింది. పేదవాడలన్నీ నందనవనాలు చేస్తుంది — చేతివృత్తులు మరిచి - మీ చేతుల్లో శ్రమజేసిన కష్టజీవులకు మళ్ళీ చేతి వృత్తులు చేయించడానికి లక్షలు డబ్బు ఋణాలు యిస్తోంది.

మేము అటే వెళతాం - అక్కడే చేతులు చాపు
తాం - వారిచ్చే డబ్బుతో నీతిగా పనిచేసి - కాస్త
నిలకడగా డబ్బు కూడబెట్టి - వేళకింత కూడుతిని -
బిడ్డల్ని బతికించుకుంటాం - ఏమిటీ? మీ చాకిరీ
ఎవరు చేయాలనా? అసలు మేము పుట్టింది ... మీ
చాకిరీ చేయడానికేనా? మీ గుడ్డలుతకడానికీ, మీ
బిడ్డల్ని ఎత్తుకోడానికీ, మీ అంట్లు తోమడానికేనా?

లేదుదొరా! ఇక అలా జరగటానికి వీల్లేదు. మీ
గాదికింద బతికే పందికొక్కులే నయం. మా కన్నా
యింటిముందు కావలాగాచే కుక్కలే నయం మా
కన్నా మీ సావిట్లో పచ్చగడ్డి మేసే గొడ్లే నయం.
మాకన్నా వాటికి వేళకింత కూడుంది- నీడుంది- కాస్త
విశ్రాంతివుంది. కాని దొరా! మేమూ మనుసులం-
చీమూ నెత్తురూవున్న మనుసులం. మంచీ చెడూ
తెలిసిన మనుసులం. సాటిమనిషికి సాయపడి, ఆక
లంటేజాలిపడి, కడుపులోదయినా తీసి యింత పెట్ట
కలిగే సహనం, సానుభూతి వున్న మనుసులం
దొరా!

అయినా మాకు విశ్రాంతి లేదు. క్షణంతీరిక లేదు. కట్టుకోడానికి బట్ట లేదు. వుండానికి నీడలేదు- బాబు! కలవారింటి ఆడవాళ్ళు కట్టిపారేసిన పాతచీరల్లో - మానాన్ని, సిగ్గునూ దాచుకొంటున్నాం దొరా! చచ్చిన రోజుకూడా కొత్త గుడ్డకు నోచుకోలేని యెదవ బతుకు బతుకుతున్నాం దొరా! యింతకాలం తమరుతిని, విసిరి, వీధిలో పడేసిన విస్తళ్ళలో మిగిలిన మెతుకుల కోసం కొట్లాడుకుంటున్నాం దొరా! యిప్పటిదాకా.

అందుకే దొరా! మాకీ బతుకొద్దు. బానిసత్వంతో ణిగిపోయే బతుకు వద్దేవద్దు. కాస్త ప్రభుత్వం విసురుతున్న గాలిపీల్చుకుంటాం. అయ్యాగోరూ ... యిక మీ పని మీరే చేసుకోండి. మీ దారి మీరే చూసుకోండి- మీ చాకిరీ మీరే చేసుకోండి.

ఏమిటీ! ప్రభుత్వం మీకు అండగా వుంటుందా ? లేదు బాబు! భూస్వాముల దౌర్జన్యాలకు ప్రభుత్వం ఎప్పుడూ సాయపడదు దొరా! మీ అహంకారాలను అణిచే అదను వొచ్చింది బాబు! మీ అకృత్యాలను, అమానుషాలను అంతం చేయడమే ప్రభుత్వ లక్ష్యం.

దొరా! అదిగో గూడెంలో జనం కట్టగట్టుకొని వచ్చేశారు దొరా అవునయ్యా! వాళ్ళకందరికీ నాయకుడు నాకొడుకే! వాళ్ళు తలుచుకుంటే మీ యింటిగుమ్మాలు విరిచేస్తారు. ఈ మేడల్లో పేర్చిన ఇటుకల్లో వీళ్ళందరి చెమట, శక్తి వున్నాయ్ దొరా! కోపంవచ్చి వాళ్ళు పిడికిలి బిగిస్తే పునాదులు కదిలి పోతయ్ దొరా! అవుసరమైతే సమాధులు కూడా కడతారు బాబూ!

దొరా! వాళ్ళను ఆపండి మీ మనసు మార్చుకోండి. క్షమాపణ చెప్పుకోండి. లేకపోతే మీ నిరంకుశత్వం నిర్మూలన చేయకుండా తిరిగి వెళ్ళరు దొరా!

ఏమంటారు? పోలీసులకు ఫోన్ చేశారా? చేయండి దొరా! తెగించి యిక్కడిదాకా వచ్చిన గూడెంలో జనం గుండెలయినా అప్పగించి న్యాయానికి ఎదురు నిల్చి పోరాడుతారు బాబూ!

ఇక మీ పెద్దరికాన్ని క్షమించే ఓపిక మా జనానికి లేదు. మీ పెత్తనం పెడత్రోవలు పట్టిస్తుంటే చూస్తూ ప్రభుత్వం కూడా వూరుకోదు దొరా! తగిన

చర్య తీసుకుంటుంది. సమయం దొరకగానే-సందర్భం కలిసి రాగానే మీా అంతు చూస్తారు. అంతే బాబూ! అంతే!

ఒక్కటి మాత్రం గుర్తుంచుకోండి!

భారతీయు లెప్పుడూ బానిసలు కానేకారుదొరా! బానిస బంధాలు తెంచుకొని బయట పడిన భారతీయు లంతా మీా బండారం బయటపెడతారు. స్వతంత్ర జీవనం సాగిస్తారు. స్వజాతి గౌరవాన్ని నిల్పుకుంటారు దొరా! నిల్పుకుంటారు. (అంటూ వడివడిగా అడుగులు వేసుకుంటూ అక్కడినుండి వెళ్ళిపోయాడు)

[తెర జారును]

# విప్లవకారుడు

[మాసిన బట్టలు, పెరిగిన జుట్టు, మస్తిష్కంలో ముసిరే ఆలోచనలు, ప్రస్ఫుటంగా ముఖంలో కనిపించే దృఢ నిశ్చయం అతని ఆభరణాలు. ఎవరో అతన్ని నెడితే క్రింద పడిపోయాడు. తిరిగి లేని శక్తిని కూడగట్టుకొని మెల్లగా లేచాడు ]

విప్ల : అవునూ- అవునూ- అవును ఎన్నిసార్లు చెప్పాలి మీకు? నేనొక సూర్యుణ్ణి-అదీ తెలీదా! దేశ పురోభివృద్ధికి పునాదిని. చైతన్య స్రవంతిని. అంటే విప్లవ

కారుణ్ణి. సమైక్యత ఆశించేవాణ్ణి, సమసమాజ స్థాపనకై తపించేవాణ్ణి- మార్పు కావాలి. దేశ పరిగతికి, ప్రయోజనానికి మార్పు మొదటిమెట్టు అందుకే సన్నికక్కడకు తీసుకొచ్చారా? (నవ్వాడు హాస్యం పెదాలమీద లాస్యం చేసేలా.)

రేయ్! అహంకారం పెదాలకు పూసుకొని- అధికారుల్ని మీ ఇరికాళ్ళకింద పెట్టుకొని సాటి మనుషుల్ని చైతన్య రహితుల్ని చేసే మీ దౌర్భాగ్యం యిక ముక్కలైపోతుంది.

అబ్బా! (ఎవరో కొట్టినట్లు చేయి చెంప మీద పెట్టుకున్నాడు నిప్పులిండిన కళ్ళతో) కొట్టరా- కొట్టు- మరో చెంప మిగిలేవుంది. కొట్టు- నువ్వుకొట్టే ఒక్కొక్క దెబ్బ భరతమాత నడిగుండెల మీద తగిలీ- తగిలీ- హృదయంలో ఆరనిజ్వాలలు రగిలీ- రగిలీ- ఇప్పటికే నీరశించి కన్నీళ్ళు కార్చి కార్చి-మీ నిరంకుశ పాలన నిర్మూలన చేయాలని కుమిలిపోతుంది చూడరా- చూడు.

అవును నీకు జాలిలేదు, దయలేదు, దాక్షిణ్యం లేదు. ఆత్మీయత అంతకన్నా లేదు.

ఏమిటీః కాల్చేస్తావా? కాల్చురా కాల్చు- తుపాకితూటాలకు భయపడే పిరికగుండె కాదురా నాది. ఈ గుండెల్లో ఆరనిమంటలున్నాయి ఈ కన్నులలో ఎర్రనిజ్వాలలున్నాయి. ఈ హృదయంలో తీరనిపగ, ప్రతీకారం ప్రజ్వరిల్లుతున్నాయి. ఎందుకో తెలిదా నీకు? మాకు జరిగిన అన్యాయం ఏమిటో ఎరగవా నువ్వు?

అవును. కడుపునిండిన వాడికి కన్నీటికథ అర్థం కాదు. ఒకసారి కళ్ళుతెరిచి ఇటు చూడు. తిండిలేని తెలుగుజాతి బిడ్డల్ని చూడు. సిగ్గునీ రొమ్ముల్ని కప్పుకునేందుకు బెత్తెడుగుడ్డ లేక పసిబిడ్డల్ని అడ్డం పెట్టుకున్న ఆడపడుచుల్ని చూడు. తాగటానికి తల్లి రొమ్ముల్లో పాలు కరువై — అరిచీ అరిచీ గొంతెండి చంకల్లోనే ప్రాణాలు విడుస్తున్న పసిగుడ్డుల్ని చూడు.

గోడలకు బదులు గోతాలడ్డం కట్టుకొని- కన్నీటి కాపురాలు చేస్తున్న కష్టజీవుల దౌర్భాగ్యం చూడు.

ఏమిటి? అదంతా వాళ్ళకర్మా? వాళ్ళంతా తెలుగువారు కారా? కూడు, గుడ్డా, నీరూ సమంగా అనుభవించే అదృష్టం వాళ్ళకు లేదా? నరనరాల

రాపిడి- తరతరాల దోపిడి- ఏమిటి అని అడిగే వాళ్ళు కూడా లేదా? ఎందుకు లేదు?

దేశసంపద ఏ ఒక్కడి స్వంతం కాదు. ప్రజా స్వామ్యపాలనలో, ప్రగతిపథంలో ప్రతి మనిషి సమైక్యతకు, సమసమాజనిర్మాణానికి తోడ్పడడం తప్పకానేకాదు- చరిత్ర చెప్పిన నగ్న సత్యాలను యుగయుగాల నుండి ఉక్కుపాదాలతో తొక్కే స్తున్న మీ నిరంకుశత్వాన్ని నిలువునా పాతెయ్యడమే నా లక్ష్యం. ఆ లక్ష్యంచేసి - భారతీయుల్ని బానిసలుగానే బతుక్రమని శాసించే మీ అమానుషాలు అణచివేయడమే నా సిద్ధాంతం.

రేయీ, పగలూ మరచి, ఆలూ, పిల్లల్ని విడిచి చెమటోడ్చి, చాకిరీచేసి, సువర్ణరాసులు పండించి, మీ గాదెలు నిండించి కూటికోసం రైతు కూలీలు కులసతుల శీలాలు, మాంగల్యాలు తాకట్టు పెట్టుకోవాలా?

ఏమిటీ న్యాయం? నగలూ, నా బూకులూ, మెట్టెలూ, ఇనప్పెట్టెలూ ఇదివరకే మార్వాడీ షావులలో తాకట్టుపెట్టి మిగిలివున్న పశువులం కూడా మార్కెట్‌లో అమ్ముకోడానికి సిద్ధమైన శ్రమజీవుల్ని ఆదుకునే అవసరం మీకు లేదా? పర దేశాలకు

ప్రభుత్వాన్నే కుదువబెట్టి కులుకుతూ కూర్చున్న మీకు ఎదుటి వాళ్ళ బాధలేం తెలుస్తాయి?

ఈ దేశం మాది. ఈ సంపద మాది. ఈ ప్రకృతిలో పండే ప్రతివస్తువూ, ప్రతిమనిషీ అనుభవించే హక్కుంది. గాలీ, నీరూ- నీడా సమంగా అనుభవించే అర్హత అందరికీవుండాలి. కాదనే హక్కు నీకుగానీ, ఏచట్టానికిగానీ లేదు.

మేమూ మనుషులమే! మాలోనూ రక్తమే ప్రసరిస్తూవుంది. అయితే మేము మునుపటిలా లేము కాళ్ళూ, చేతులూ ముడేసుకొని మీరంతా మూలన కూర్చుంటే మా ముసలివాళ్ళు మీ ముంగిటకొచ్చి కళ్ళాపిచల్లి, ముగ్గులు అల్లి, నీళ్ళు తోడి, కాళ్ళు పట్టి, మీరు పడుకోవడానికి పడకటిళ్ళలో పట్టె మంచాలమీద పక్కలు పరిచి జోలపాడి జోకొట్టే కాలం గతించింది.

ఇది ప్రజాస్వామ్యం. ప్రజల క్షేమాన్నే ప్రభుత్వపు కర్తవ్యం. అందుకే అధికారం మా చేతిలో పెట్టింది. అందుకే అగ్రస్థానాలు మాకప్పగించింది. అధికార పీఠాలమీద దొర్లడానికి అవి మీ స్వంతాలుకావు. ఇంతకాలం మేము క్షమించాం. సహించాంకూడా.

అంతేకాదు...సేవ, చాకిరీ, బానిసత్వం, ఊడిగం చేశాం మీకు. ఇస్త్రీమడతలు చెరగని చొక్కాల్లో యింకా బొర్రలు పెంచుకుంటూవుంటే మీ చిరునవ్వులకు మా జీవితాలను శాశ్వతంగా అర్పణ చేశాం. అందుకు మీరు మాకు చేసిందేమిటి? మిగిల్చిందేమిటి? బరువు బ్రతుకులు, ఆకలికడుపులు! (నవ్వాడు హేళనగా. కోపంగా) పిచ్చివాడా! అన్నదాతల్ని ఆక్షేపించకు! మిమ్మల్ని కుబేరుల్ని చేసిన కూలీలను చులకనగా చూడకు!

"ఏమిటీ? నీ భవిష్యత్తును బంగారంచేసింది కార్మికులూ, ధార్మికులూ కారా? ఒక్క పూట రైతు నాగలి పట్టకపోతే, చెమటతో నేల తడపకపోతే మీ ఆడంబరాలు బయటపడతాయిరా! ఒక్కరోజు కార్మికుడు తన కన్నీళ్ళు ఫ్యాక్టరీల్లో కళ్ళాపిగా చల్లకపోతే యజమానులు ఏమౌతారో తెలిసిపోతుందిరా! ఒక్క గంట కష్టజీవి చీపురు చేతబట్టి వీధులు బాగు చేయకపోతే మీ జీవితాలకే మురికి పడుతుంది - మునుగుపడుతుంది.

అబ్బా (అంటూ క్రింద పడి మళ్ళీ తేరుకుని మెల్లగా లేచాడు) మీ నిరంకుశపాలన నిర్మూలన

కానిదే నాలాటి నిర్భాగ్యులకు నిలువ నీడ ఉండదు. మీ అత్యాచారాలూ, అమానుషాలూ సహించి - క్షమించినంతకాలం మాకీ చెంపదెబ్బలూ, చెవ్వు దెబ్బలూ తప్పవు.

ఏమిటీ ? నేను అసహాయుణ్ణా ? అండలేని తిండి లేనివాణ్ణా ? ఒరేయ్! నరోత్తమ నీ చేయి పైకి లేస్తే వందలాది ప్రజలచేతులు మీ వీపులమీదపడతాయ్! గుర్తుంచుకో - - నవ్వు - యింకా పెద్దగా నవ్వు - ఆకాశం బద్దలయ్యేంత పెద్దగా నవ్వు. దిక్కులు పిక్కటిల్లేలా నవ్వు - నవ్వి నవ్వి పెదాలతడి ఆరి మూతబడిపోతాయి.

అవును. నాది ప్రేలాపన. ఇది మీరు చేసే ఆరోపణ. అంతేకదూ ? నేను విసిరే నిప్పుల నిజాలు మీ యిజాలను కాల్చి బూడిద చేస్తాయి. భుజాలు తడుముకుంటున్న నీకు నీతి, నిజాయితీ లేదు.

ఆగు అడుగు ముందుకు వేస్తే నీ ఆఖరి క్షణాలు చూస్తావ్ ! గొంతెత్తి నేను ఒక కేక వేస్తే లక్ష గొంతులు పలుకుతాయి. నీ లక్క మేడల్ని ముక్కలు చేస్తాయి.

ఏమిటీ? నీకు లాఠీలూ, లాకప్‌లూ, సంకెళ్ళూ సైన్యా అండగా వుంటాయా? అధికారాన్ని అమాయక ప్రజలమీద ప్రయోగించి అంతం చేస్తారా?

అయితే రండి. ముందుకు రండి. ధైర్యముంటే, దమ్ముంటే దగ్గరకు రండి. చేయి చేసుకుంటే మా దౌష్ట్యాలూ, దౌర్జన్యాలు విరిచేసి - మిమ్మల్ని నడి బజార్లో నిలెయ్యడానికి, నిగ్గదియ్యడానికి నిలువునా కడిగెయ్యడానికి వేలాది కార్మికులూ, కష్టజీవులూ — ఆరుగో మా యింటి గుమ్మంలో.

అవును. నేను సత్యాన్ని! సమైక్యతకూ, సమ సమాజ స్థాపనకూ నేనో గమ్యాన్ని, విప్లవాన్ని! ఇది నా భావాల భవనం. (తన గుండెలు చూపాడు) ఇక్కడ నిరాశ్రయులకు నీడుంది. ఇది నా ఆలోచనల అరణ్యం. ఇక్కడ మనుషులకే కాదు, మృగాల కూడా చోటుంది. ఇది నా ఆవేదనల అగాధం. పడిపోయే వారికి చేయూత దొరుకుతుందిక్కడ.

అందుకే ప్రజలు నన్ను వెంబడించారు: ఆకలితో నకనకలాడే నవతరం నా లక్ష్యాలకు వూపిరిపోసింది.

ఇది కమ్మటి కాసారం ఊహల వూయల. ఇక్కడ ప్రజా శ్రేయస్సు మొగ్గలు తొడుక్కుంటుంది. ఆ శాంతి గులాబీలను రేకులు విరగకముందే నా సోదరులకు పంచి పెడతాను. అప్పటిదాకా బ్రతుకనివ్వరా నన్ను.

ఒరేయ్! చావుకు భయపడి మీ చాదస్తాను క్షమించి యింకా యీ దేశ ప్రజల్ని అన్యాయం చెయ్యలేను. నా గమ్యంలో ప్రజాస్వామ్యం వుంది. అది విరజాజిలా వికసించి గుబాళిస్తుందికూడ, ఆ పరిమళాలు పీల్చడానికీ, మీ ఆడంబరాలను కాల్చడానికీ, అకృత్యాలను కూల్చడానికీ యువతరం కళ్ళు తెరిచింది మీ కళ్ళు తెరిపిస్తుంది.

ఏమిటీ! గుండెల్లో అధికారపు అంకుశాలు గుచ్చుతారా? నాకు తెలుసు. మీ రెంత నీచానికయినా దిగజారుతారని.

కాకపోతే ఏమిటి? మంచినీ, మానవతనూ, శాంతిని, సౌభాగ్యాన్ని సమాజంలో పండించాలనీ, మీ గొంతుల్లో నిండించాలని కలలుగన్న మహనీయులు ఎందరో యిదివరకే బలై పోయారు. కర్మ

ష్టపు చావుకు గురయ్యాక. అనాదినుండీ ఈ అత్యాచారాలకు అంతంలేకుండా పోయింది.

ఇంకా ఏంచేయాలి? ఏసును శిలువవేశారు. గాంధీని కాల్చేశారు. మంచివాళ్ళ నెందరినో వంచనతో వధ చేశారు. ఇది సత్యంకాదా? ఎందుకాకు?

అవును. వీరే...వీరిలాటి పెద్దలే అధికార మదంతో త్రవ్విన అగాధాలే యివి. అంతానికి లేకుండా పడవేసిన అగ్నిగుండాలే యివి. శాంతి సమైక్యత బోధించాలని తపించడమే నా నేరం అయితే దానికి శిక్ష, చిత్రహింసలూ, మారణ హోమాలు, మానభంగాలు - ఇది ఈ రాజరికం, పెద్దరికం, కసాయితనం.

కాని ప్రజాసమూహం ప్రవాహంలా పొరలింది కదిలింది. అది ఈ లోగిళ్ళనూ, నిరంకుశ పాలనా సంకెళ్ళనూ ఉరితాళ్ళనూ బూడిదచేస్తాయి.

ఏమిటి? ప్రజలు ఎవరా? ఎరగనే ఎరగరా మీరు? మొన్నటిదాకా ఇంటింటికీ తిరిగి బిచ్చగాళ్ళలా చేతులు జాపి దేహీ అని మొక్కితే పవిత్రమైన ఓట్లు దానంచేశారే- వాళ్ళు ప్రజలు. అధికారపీఠాలను ఈ

కప్పగించి వాటిమీద మిమ్మల్ని ప్రతిష్ఠింపజేసి అడు
గులకు మడుగులొత్తుతూ తొత్తుల్లా, కుక్కల్లా మీ
గుమ్మాలముందు పడివున్నారే - వాళ్ళు ప్రజలు.

వాళ్ళ దయాభిక్షతోనే యింతకాలం మీరు
దర్జాగా బ్రతికారు, దర్పంగా జీవించారు. వాళ్ళ
సానుభూతి, సహకారాలే మీ కొండలనిండా పూల
హారాలై భగవంతుడిచ్చిన వరాలుగా మీ జీవితా
లను వెలిగించాయి కూడ.

మధువులతో పెదాలు తడుపుకుంటూ మగువ
లతో సరదాల పరదాల చాటున సరసాల భాగోతం
సాగిస్తున్న మీ ఆటలు యిక సాగవు. కల్లబొల్లి
మాటలు యిక చెల్లవు.

రండి - నాలో పిరికి గుండెలు లేవనీ, అహింసా నియ
మాల, శాంతి సహనాల బండలు అని యిదివరకే
చెప్పాను. వాటిని పగుల గొట్టడానికి ఏ చట్టానికి,
శాసనానికి హక్కు లేదు

అబ్బా! (అంటూ జుట్టుచేత్తో పట్టుకొని - కారు
తున్న రక్తంతో తడిసిన చేతులు చూసుకొంటూ -
పడబోయి - తమాయించుకొని బాధగా మూలుగుతూ
తేరిపారచూశాడు వాళ్ళ వంక) కమ్మని కలల్ని

కసాయితనంతో కాల్చివేశారా? మారిన చట్టంతో మారణహోమాలు సాగించే మీలాంటి మానవ మృగాలకు ఈ సంఘంలో యింక మంచిస్థితి కూడా పుట్టవురా నీచుడా!

ఒరేయ్! పెత్తందారీ! సత్యాన్ని సజీవంగా దహనం చేసే - మీ పెద్దరికం మా కొద్దని చెప్పడానికి వచ్చిన విప్లవ సోదరుల్ని ఒక్కసారి చూడరా! వ్యక్తిని పతితను చేసిన మీ అప్రయోజకత్వం అక్కర్లే దని- మీ గుండెల్లో చైతన్య జ్యోతులు వెలిగించ డానికి- నిద్రాహారాలు లేని నినాదాలతో యువతరం వచ్చింది చూడ్రా!

అరుగో యువరక్తం పొంగే భావితరాల పౌరులు, భారతీయులు. ఇంతకాలం బానిసలుగానే పడివుండి- ఉడికిపోతున్న వుద్రేకాలను పిడికిళ్ళలో బిగించి కార్యదీక్షను కళ్ళల్లో ఎర్రనిదీపాలు చేసుకొని గుండెల నిండా ప్రతీకార జ్వాల రగిలించుకొని - వచ్చారు. చూడ్రా!

అంతేకాదురా, అంతేకాదు. మీ కసాయి తుపాకీ తూటాలకు చిందిన రక్తంతో తడిసిన నేల ఎర్రని కిర ణాలను వెదజల్లుతుంది. నా నెత్తురు గడ్డకట్టిన తెలంగు

గద్దలో ఎంతమంది ఎర్రసూరీడులు ఉద్భవిస్తారో చూడు.

ఆ ఉదయ కిరణాలన్నీ ఉజ్వలమై, జ్వలిత జ్వాలలై ఆకాశందాకా ఎగసే మంటలై నీ గుండెలలోతుల్లో పేరుకు పోయిన స్వార్థపు చిట్టెపు రాళ్ళను కసితో కాల్చి మసి చేస్తాయిరా. నీ కళ్ళు తెరిపిస్తాయి.

ఒరేయ్! చైతన్య స్రవంతిలో మునిగి నవసముజ్వల కాంతిని ముఖాలకు పులుముకొని నీలో అలుము కున్న చీకటిని చీల్చడానికి ముందుకొచ్చే నవతరానికి హద్దులు లేవు అడ్డంకులు లేవు. వాళ్ళకు క్షమాపణ చెప్పుకోండి.

ఏమిటీ? వాళ్ళంతా బానిసలు గానే పడివుండాలా? వీల్లేదు. ఈ దేశంలో భారతీయులు ఇంకా బానిస లుగా జీవించడానికి వీల్లేదు. నవశక్తిని పుణికొని యువరక్తం పొంగులువారుతున్న నా సోదరులు నీ కర్కశత్వాలకూ, కాలుష్యాలకు బలికావడానికి వీల్లేదు. అభివృద్ధిని అగాధంలో పడవేసిన నీ వదమంత్రివుసీసీ, రాజకీయ తంత్రాంగాన్ని మార్చి మరుమల్లెల మాధుర్యాన్ని చిరుజల్లులుగా చల్లడానికి

సమైక్యంగా వచ్చిన శాంతిబిడ్డల్ని అంతం చేయడానికి వీల్లేదు.

ఆరుగో! వచ్చేస్తున్నారు. గొడ్డళ్ళతో, కొడవళ్ళతో కత్తులతో కళ్ళనిండా కరుడుగట్టిన నెత్తురుతో నా తమ్ముళ్ళంతా వచ్చేస్తున్నారు.

ఏంచేస్తారా? మీ గుమ్మాలముందు కూర్చున్న మృత్యువును మీపైకి ఉసిగొలిపి, మీ పునాదుల మీదే సమాధులు కడతారు.

యువకుల్లారా ఆగండి. నేను చావడంలేదు. సత్యం- దేశసంస్కృతి ఎప్పుడూ చావదు- చావకూడదు. అందుకే పెద్దరికం పేరుతో ప్రజల్ని పెడత్రోవ పట్టిస్తున్న ఈ స్వార్థపరుల హృదయాలను మంచితనంతో పండించండి. శాంతి, సౌభాగ్యాలు వెల్లివిరిసేలా సహనమూ, చైతన్యమూ నూరిపోయండి వద్దు బాబూ- వద్దు- కసాయితనం మనకొద్దు. నేనొక్కణ్నే కన్నుమూస్తే లక్షలమంది మీరున్నారు. ఇన్నాళ్ళూ నా చేతిలో వెలిగిన భవితవ్యం యొక్క మీరు భరించండి. దాన్ని దేదీప్యమానం చేసి

ఆకాశందాకా ఎగురవేసి- విశాల విశ్వ వీధులలో
చిగురింపజేయండి చీకటినిండిన యీ పెద్దమనుషుల
స్వార్థపుగుండెల్ని- చైతన్యంతో కరిగించండి. సమై
క్యతనూ, శాంతినీ, దేదీప్యమానం చేసి- దేశసంప్ర
దాయాల మీాద వెలిగించండి. చట్టంమారినా యింకా
మారని ఈ మనుష్యుల్లో- మంచినీ, మానవతనూ
నిండించి- ప్రగతికీ, ప్రయోజనానికీ పునాదులు
వేయండి. పీడితప్రజల కానిస శృంఖలాలు తెంచి,
ఆత్మీయతను పెంచే సమసమాజ స్థాపనచేయండి.
అదే నా లక్ష్యం. అదే నా ఆశయం. అమ్మా!
భరతమాతా! యింకెంతకాలం యీ నిరంకుశాధి
పతులకు పవిత్రశీలాన్ని తాకట్టు పెడతావు తల్లీ!
శరీరం కుళ్ళి, వయసుమళ్ళి దిగుళ్ళ గుండెల్లో గోరీలు
కట్టుకున్నా- కన్నీళ్ళుదిగమింగుతావమ్మా? నీ ముద్దు
బిడ్డల ప్రాణాలు- యీ మూర్ఖుల దౌర్జన్యాలకు
దహించిపోతుంటే- ఇంకా క్షమించి ఉరుకుంటావా
తల్లీ? నిన్నుపతితనుచేసి- నిత్యనూతనంగా నీతో
సరసాలాడే ఈ దురహంకారుల దౌష్ట్యాలనువిరిచివేయ
డానికి ముందుకొచ్చిన యీ శాంతిపౌరుల్ని- చేయి

చావిదీవించు తల్లీ! స్వాతంత్ర్యాన్ని, సమతావాన్ని సమాధి చేస్తున్న యీ స్వార్థపరులిని విప్లవ ఖడ్గాలతో తెగనరకడానికి ధయిర్యాన్ని, మనస్థయిర్యాన్ని ప్రసాదించు తల్లీ! విప్లవం వర్ధిల్లాలి, విప్లవం వర్ధిల్లాలి!

(అంటూ క్రిందపడి చనిపోయాడు.)

[ తెర జారును ]

# హలో దేవదాసు



[ఒక అందమైన మేడముందు ఆవరణలో దేవదాసు తాగుతూ వుంటాడు. అక్కడ గ్లాసులుగానీ, తిను పదార్థాలుగనీ ఏమీ లేవు, చేతిలో బాటిల్ తప్ప. ఎదురుపక్కన నిషాకళ్ళతో ఒకసారి గోడకమర్చిన శంకరేశ్వరస్వామి పటం వేపు చూశాడు. నెమ్మదిగా దగ్గరకు నడిచాడు తూలుతూ.]

దేవ : నమస్కారం దేవుడుగారూ! ఏమిటి అలా చిక్కిపోయారు? మిమ్మల్ని చీకటిగదిలో బంధించి పాలూ, పంచదార నైవేద్యాలు మెక్కుతున్న పూజార్లు ఎంత దయమాలిన వాళ్ళో మీకు తెలీదుసార్! (నవ్వాడు)

అయ్యా దేవుడుగారూ! మీరు వుచ్చుకున్నారా ఏమిటి? మత్తుగా మాట్లాడుతున్నారు? లేదుసార్! పంగనామాలు లేకపోతే పరమాత్ముడికీ, పైటకొంగు వేసుకోకపోతే వధుచుదానికీ, ఈపరమావధం వుచ్చుకోకపోతే మగపురుషుడికీ అందం ఏముంటుందిసార్?

ఏమంటున్నారూ? దీనిరుచి మీకు తెలీదా? పూజార్లు వుచ్చుకొని వళ్ళు మరచి వాకిళ్ళలోనే నిద్రపోతున్నారా? పళ్ళు, ఫలహారాలు కూడా మీకు వాసనచూపడం లేదా? ంతేసార్! యుక్త రాలెకరాలు మాన్యం మీపేర వాళ్ళ చేతులలో పెడితే... వచ్చే ఆదాయంతో ఆనంద డోలికల్లో తూలుతూ, తాగుతూ పాపం మీకు పాతపీలికలే మిగిల్చారు. ఏంచేస్తారు మీరు? నోరు లేదుగా.

ఆగండి... కాస్త పెదాలు తడుపుకున్న తర్వాత మాట్లాడుకుందాం. (అంటూ బాటిల్ మళ్ళీ ఎత్తి పట్టి గటగటా త్రాగేశాడు, పెదాలు తుడుచుకుంటు న్నాడు. ఇంతలో ఎవరోవస్తూ అతన్ని తాకితే ... చేతిలో వున్న బాటిల్ క్రిందపడింది - (దిగాలుపోయి దిక్కులు చూశాడు ) ఈ మధుభాండాన్ని ఎవరు ఇలా నట్టిపాలు చేసింది? (అంటూ కూర్చుని ముక్క

లు ఏరాడు) ఎందుకిలా మధుభాండాన్ని మట్టిపాలు చేసింది? ఎవర్నువ్వు? (అంటూ కోపంగా లేచాడు.) మాట్లాడవేం? ఎవర్నువ్వు? సుధ... మధురమైన పేరు. పారీ మధువులాంటి పేరు. ఏహృదయాన్ని పగలగొట్టి వచ్చావిక్కడికి? ఏమిటీ! ఒక రౌడీ వెధవ నిన్ను తరుముకొస్తున్నాడా? (పెద్దగా నిషాగా నవ్వాడు.)

మరి పచ్చితాగుబోతు చాటుకొచ్చావేం? నా మీద నమ్మకం వుందా నీకు! అసలు నామీద నాకు నమ్మకంవుండాలిగా? ఆల్ రైట్! నిన్ను కాపాడుతాను. నా గుండెలో పెట్టుకొని కాపాడుతాను. నిన్నీ ఒక్క రాత్రికి కంటికి రెప్పలా కాపాడుతాను. మేడ మీద నాగది ఖాళీగావుంది. వెళ్ళి పడుకో! దహ్యా నుగా మనిషిని నమ్మి, మనసును అనుమానించే మనుషులంటే నాకు పరమ అసహ్యం అని- (నవ్వాడు) ఇంట్లో ఎవరూ లేరు- లక్షలకు తరగని ఆస్తి- ఈ లక్కమేడకూ నేనొక్కడ్నే వారసుణ్ని- జాము పొద్దుపోయిన తర్వాత పంచవన్నెల రామచిలుకలు పక్కన నవ్వుకుంటూ పక్కమీద చేరతాయి. ఇష్టమైనంత సేపూ యీ మగపురుగుతో ఆడుకుంటాయి. యిచ్చినంత పుచ్చుకొని జారుకుంటాయి.

అవును రసికుణ్ణి, శృంగార పురుషుణ్ణి, నిలువెల్లా నిషానిండిన వాణ్ణి మాత్రమే కాదు మేడమ్! మగువల అధరామృతాన్ని ఆలుపొచ్చేదాకా తాగి-తైపెక్కి-కిందా, విూదా తెలియక తలక్రిందులుగా జీవితాన్ని ఆనందసాగరంలో యీదుతున్న మరో దేవదాసుని- తెలిసిందిగా వెళ్ళి పడుకో- (రెండడుగులు నడిచాడు తడబడుతూ. యింతలో ఎవరో ఎదురైనట్లు తటాలున ఆగిపోయాడు.)

ఎవరున్నావ్? ఓ- అబ్బిగాడు! ఏ చెట్టువిూన వాలిందిరా పిట్ట యిటు తొలుకొచ్చావు? ఏమిటీ? పరిగెత్తే పిట్ట ప్రతిచెట్టువిూద వాలుతుందా? అయితే ఎంతిమ్మంటావు? క్రిందనుంచి పైదాకా పారచూసి సరసానికి పనికొచ్చే లక్షణాలేవీ కనిపించడంలేదురా పట్టుకెళ్ళు పాతరేటు (అంటూ రెండు వచ్చనోట్లు జేబులోంచి లాగిఇవ్వబోయాడు. )

రేయ్ అబ్బిగా! పటికిబెల్లంలాంటి పడుచుదైనా పాతరేటే యిస్తున్నాడని సందేహిస్తున్నావా? ఫరావ్ లేదు. తీసుకో. ఒక్క రాత్రికేగా వాడుకునేది. తీసుకో. (యిచ్చేశాడు. కోటుజేబులోనుండి మరో బాటిల్ తీసి సీలు లాగేశాడు నోటితో. ) ఏమిటి? అప్పుడే మేడ దిగొచ్చావ్? సరసానికి వేళయిందా?

నేను ఏం మాట్లాడుతున్నానో తెలీకూడ నంత మత్తు లో వున్నావు. నువ్వేం వుచ్చుకున్నావు? వలపా? వయ్యారమా? చెప్పాలుగా... నేను అందాలను కొనుక్కునే వాణ్ణి. ఇప్పుడు నిన్ను కొన్నాను రెండువందలకు, ఈ ఒక్క రాత్రికి నిన్ను వాడుకోవ డానికి. రెండు పచ్చ కాగితాలు ముందుగానే యిచ్చే శాను. (నవ్వాడు. హేళనగా, నిషాగా)

కమాన్! ఇప్పుడు నాహృదయం ఖాళీగా వుంది. ఒక్కసారి గుండెలకు హత్తుకో. కసి కసిగా ఆనందసాగరంలోకి కలిసి వెళ్దాం. కమాన్. (అంటూ బాటిల్ ఎత్తి పట్టాడు. మళ్ళీ గటగటా తాగేశాడు.)

నేను మధురసం తాగేవాణ్ణని ముందుగానే చెప్పాను. మగువలయౌవ్వన రసాలుగూడా కడుపారా తాగి కైపెక్కి జీవితాన్ని కసికసిగా అనుభవించే హక్కు ఆభగవంతుడు నాకు ప్రత్యేకంగా ప్రసాదించాడు. కావాలంటే అడుగు.

దేవుడుగారూ! మీరు చెప్పండి మీ కళ్ళెదుట ఎంతమంది కన్నెల జీవితాలు గంగలో కలిసిపోయాయో చెప్పండి (నవ్వాడు పరిహాసంగా)

పాపం! మీకసలు నోరే లేదుగా! ఇంకేం మాట్లాడు తారు?

ఏమిటి? నేను చేస్తున్న అమానుషాలకు అంతం లేదా? పాపం పండిందా? (నవ్వాడు) అసలు వీరా పాపం పండే నా యింటికి చేరారు. దేవుడుగారూ! నాలుగు గోడలమధ్య నలతగా పడివున్న వీరాకు నాజూకులూ, పగిషీలు తెలీవుపార్! ఇదిగో సుధా రాణి! ఎంత అందంగావుందో చూడండి.

ఎయ్ నోర్మూయ్యి. డొక్క చీరేస్తాను. నేనివ్వాడు నిన్న కొన్నవాణ్ని. తెలిసిందిగా! కమాన్? ఇంకా ఆలశ్యం చేస్తే అమృతంలో హాలాహలం కలిసి ఆనం దానికి అత్యంతరం ఏర్పడుతుంది. కమాన్! ఏమిటి? మోటుసరసమా? (నవ్వాడు)

మరి నాచేతిలో నలిగిపోయిన సంపెంగలూ, సన్న జాజులూ, మల్లెలూ, మందారాలూ ఎన్నో చెప్ప మంటావా? ఐ యాం సారీ! నేనూ లెక్క మరిచ్చి పోయాను

అయినా మనం యిద్దరం యింతకుముందు జరిగిన అనుభవాలను వదిలేద్దాం. వడివడిగా భవిష్యత్తులోకి పయనిద్దాం. కమాన్!

ఏయ్! బెట్టుచేసే ఆడవాళ్ళంటే నాకు భలేకోపం! ఒకపట్టు పట్టాలని గుండెల్లో కసిరేగుతుంది. అప్పుడు

బలవంతంగా అనుభవించే దౌర్భాగ్యం పడుతుంది.
రా! ఒకసారి హృదయంలోకొచ్చి కన్నోదాన్ని!

కమాన్! సిగ్గులతో ఎరుపెక్కిన ఆ లేతబుగ్గల్ని, సిగ్గుల్ని, తపనతో వల్లాంటి పెదాలను నోటితో అందించు!

ఏయి! ఏమిటి దేవుడిదగ్గర కెళుతున్నావు? ఆయన్ని రక్షించేవాళ్ళు లేక నా యింటి గోడమీద ఒంటిగా తపస్సు చేస్తున్నాడు. ఇంకా ఆయన కాళ్ళమీద పడతావేం? రా ఇటూ! (అంటూ పట్టుకోబోయాడు. లైట్లు ఆరిపోయాయి మళ్ళీ వెలుగులో తృప్తిగా పెదాలు తుడుచుకుంటూ, బట్టలు సర్దుకున్నాడు.

అయిపోయింది మిస్ సుధారాణీ! ఇక నువ్వు వెళ్ళొచ్చు. వెళ్ళమనే అధికారాన్ని యిప్పుడేపోగొట్టుకున్నానా? (నవ్వాడు)

ఇంతకుముందు యింటికొచ్చినవాళ్ళంతా యిష్టమైనంత నేను యిచ్చేకము గాడి యిచ్చినంత పుచ్చుకుని వచ్చినదారినే వెళ్ళేవారు. నువ్వేమిటి వెళ్ళనటున్నావు?

నిన్ను నేను చెడగొట్టానా? అందుకని నీ మెళ్ళో తాళికట్టి ఆలిని చేసుకోవాలా? (నవ్వాడు హేళనగా)

నో...నో...మిస్ రాణీ! దటీజ్ యింపాజిబుల్! నాకు ఆడవాళ్ళంటేనే నమ్మకంలేదు. అసలు నమ్మ

కాలమీదే నమ్మకంలేదు. (దూరంనుండి నవ్వులు వినిపించాయి. ఆలకించాడు)

ఎవరా నవ్వేది? ఏమిటా నవ్వులు? మూల్గాద వేం? (అంటూ బయటగుమ్మంచాకా వెళ్ళాడు) ఎందు కలా వికటంగా నవ్వుతున్నావ్? ఏమిటి? నీ పగ చల్లారిందా? ఎవరా మాటనేది?

ఓ...అబ్బిగాడు! నువ్వా నవ్వింది? ఏం కావాలి నీకు? ఎందుకలా పరిహాసంగా నవ్వుతున్నావ్? ఏమిటీ? నీ పగ చల్లారిందా? నీకసి తీరిందా? ఇకనువ్వు నిశ్చింతగా బ్రతుకుతావా?

అసలు నామీద నీకేమిటిపగ? నా తండ్రి చేశాడా? ఏంచేశాడు? నమ్మను- నేనమ్మను! నా తండ్రి ఎవరికీ అన్యాయం చేయలేదు. చేయనుకూడ. దిక్కులేనంత అకృత్యం ఆయన నీకేం చేశారు?

ఏమిటీ? సుధ నా చెల్లెలా? అబ్బిగా! (అంటూ పెద్దగా అరిచాడు ఆవేశంగా)

ఎంతపని చేశావ్రా? ఎంత మోసం చేశావ్? నీకు నేనేం అపకారం చేశానని నాచేత యింత పాపం

చేయించావ్? ఆయన నీ తల్లిని అన్యాయం చేస్తే నువ్వు నన్నూ, నా చెల్లినీ అన్యాయం చేస్తావా?

ఒరేయ్ అబ్బిగా! నిన్ను భగవంతుడు క్షమించడ్రా! క్షమించనే క్షమించడు. వెళ్ళు. నీ కడుపుమంట చల్లారిందిగా! వెళ్ళరా వెళ్ళు. (సుధను చూస్తూ మెల్లిగా జమే వేస్తూ నడిచాడు అడుగులు తడబడుతూ)

సుధ నా చెల్లెలు! అవును. నా చెల్లెలే! ఆరోజు... నా తల్లి ఆస్పత్రిలో ప్రసవించింది ది ఆడపిల్లను కన్నది. కాని ఎవరో దొంగ బిడ్డను ఎత్తుకువెళ్ళాడని డాక్టర్ చెప్పాడు. ఆ దొంగ ఈ అబ్బిగాడన్నమాట! ఎవరో వాడికి ద్రోహంచేస్తే నాతో స్నేహంచేస్తూ నా బలహీనతలు ఆసరాగా తీసుకుని నన్నే వంచించాడు. నాచేత ఘోరమైన పాపం చేయించాడు.

దేవుడుగారూ! నన్ను క్షమించండి. నన్ను దహించివేస్తున్న ఈ పాపాగ్నిలో యింత కరుణరసం కురిపించి చల్లార్చండి! కామాంధకారంతో కళ్ళుమూసుకుపోయి స్వంత చెల్లినే...

ఛీ! ఛీ! చెప్పుకోడానికే సిగ్గుగా వుంది. నా మొఖం చూస్తేనే మహాపాపం నేను జీవిస్తే యింకెంతమంది కలుషితంలో పడిపోతారో?

అందుకే... దేవుడుగారూ! నేను వినాశీగాడు ఈ లోకానికే దూరంగా వెళ్ళిపోతాను. కామాగ్నిలో కాలిపోయిన కన్యాతనం చిన్నబోతే నేను ఎలా బ్రతకాలి? నా లాంటి నికృష్టులు ఈ లోకంలో వుంటేనే మహాపాపం.

అమ్మా సుధా! నన్ను క్షమించు తల్లీ! నన్ను క్షమించు- వద్దమ్మా వద్దు... క్షమించమని అడిగే అర్హత కోల్పోయిన నన్ను ఎవరూ క్షమించరు. (అంటూ జేబులోనుండి పిస్టల్ తీశాడు)

సుధా! ఇదిగో! ఇది పిస్టల్ - ఇందులో వున్న గుండ్లు కొన్ని నిముషాల్లో నా గుండెల్లో దూసుకు పోతాయ్!

వద్దమ్మా! వద్దు. నీవు చావడానికి వీల్లేదు నేను చేసిన పాపానికి నీ ప్రాణాలు అర్పించడానికి వీల్లేదు.

ఏమిటీ! ఈ పాపంలో నీకూ భాగం వుందా? లేదమ్మా! ఈ తప్పు నాది. నన్నే కాల్చివేయనీ!

దేవుడుగారూ! చూడండి! అహంకారంతో నేను చేసిన అమానుషం ఎంత నీచానికి గురిచేసిందో చూడండి. తరగని ఆస్తివుందని కాగి తందనాలాడే నా బ్రతుకులో యెంత దావానలం రగిలిందో చూడండి. నన్నెంత దారుణంగా కాల్చివేస్తుందో చూడండి

అవును... మీరు మాట్లాడలేరు. నాలాంటి నీచులకు మీ ముఖం చూసే భాగ్యం లేదు. పెంచే పెద్దలు లేకుండా పెరిగే బిడ్డలకు గతి అధోగతి అవుతుంది. దేవుడుగారూ! దారం తెగిన గాలిపటాల్లాగ ఎడారులలో తిరిగే నా బోటి శృంగార పురుషులకు ఎక్కడా చోటు లేదు. చివరకు కట్టుసీదకూడా కరువైపోతుంది.

అందుకే నేను దూరంగా వెళ్ళాలి. నీతికీ, నైచ్యానికీ మధ్యనలిగే నేను దూరంగా వెళ్ళిపోవాలి- మంచికీ చెడుకూ మధ్యరగిలే నేను దూరంగా వెళ్ళిపోవాలి. ఆడంబరాలకూ, అనుమానాలకూ అలవాటు పడిన నేను- దూరంగా వెళ్ళిపోవాలి

అమ్మా! సుధా! ఏమిటిది? ఎందుకిలా అయిపోయావు: విషం తిన్నావా! అయ్యో భగవాన్ ఎంత ఘోరం చేశానయ్యా! సుధా! సుధా! ఒకసారి మాట్లాడు తల్లి! ఈ పాపాత్ముణ్ణి ఆఖరిసారిగా "అన్నయ్యా" అని పిలూ సుధా! అన్ని ఉత్సాహాలూ కోల్పోయిన నేను అందరికీ దూరమైపోతానమ్మా!

సుధా! మాట్లాడు! ఒకసారి ఈ నీచుణ్ణి కళ్ళతో చూడు. వావి వరుసలు మరిచి- అక్రమంగా నీ నిండు జీవితంలో నిప్పులు పోసిన ఈ దుర్మార్గుణ్ణి అన్నయ్యా అని పిలూ తల్లి! అమ్మా! సుధా! (అంటూ పెద్దగా అరిచాడు.)

నువ్వూ కన్నుమూశావా చెల్లీ! మరి నేనెవరి కోసం బ్రతకాలి? ఎందుకు బ్రతకాలి? అదిగో! నన్నూ మృత్యువు పిలుస్తోంది. నా కోసం యమదూతలు గుమ్మంలో నిలిచే ఉన్నారు.

సుధా! మనం ఈ లోకంలో గాకపోయినా మరో లోకంలోనైనా అన్నా చెల్లెళ్ళుగా ఉందాం చెల్లీ! ఆత్మీయతను పంచుకుని- అనుబంధాలను పెంచుకుని- మమతా మమకారాలతో మనిద్దరం అన్నా చెల్లెళ్ళుగా వుండిపోదాం సుధా! అందుకే వస్తున్నా! నేనూ నీతో పాటే వస్తున్నాను. పూలరథం వచ్చింది. ఎక్కి- నీ దగ్గరకే వస్తాను చెల్లీ! నేను చేసిన పాపాన్ని ఈ తుపాకి తూటాలతో కాల్చి, మసిచేసి మనిషినై వస్తాను చెల్లీ! (అంటూ పిస్టల్ గుండెలకు గురిచూపుకుని ట్రిగ్గర్ నొక్కాడు. "అబ్బా" అని పెద్దగా అరిచాడు. పడిపోయాడు. మెల్లగా జరుగుతూ వెళ్ళాడు) సుధా! వచ్చాను చెల్లీ! నేనూ వచ్చేశాను. ఈ మరో దేవదాసు మరో జన్మలో నీకు అన్నయ్యగానే పుడతాడు చెల్లీ! (అంటూ ప్రాణం విడిచాడు.)

[ తెర జారును ]

# ఆకలి దొంగ

[సుమారు రాత్రి పన్నెండుగంటల సమయం. చింపిరి గుడ్డలు కాదుగాని...మాసిన బట్టలు, కొద్దిగా పెరిగిన జుట్టు, గడ్డము అతని అలంకరణలు. అతన్ని అందరూ "దొంగ" అంటారు. ఇప్పుడూ కొంతమంది అతన్ని తరుముతూ వచ్చారు. కాని, ఈ దొంగ మాత్రం తప్పించుకున్నాడు. అందరూ వెళ్ళిన తరువాత గట్టిగా శ్వాసపీల్చి గుండె నిబ్బరం చేసుకుని దిక్కులు చూశాడు.]

దొంగ: పారిపోయారు! అయినా నన్ను పట్టుకోవాలని ముందుకొచ్చిన వాళ్ళు యింతవరకూ ఎవరూ లేరుగా! దొంగతనం చేయకూడదట! చేయకూడదు. (పళ్ళు కొరుక్కున్నాడు కసిగా, కర్కశంగా) ఈ మాట ప్రభుత్వం పదిసార్లు చెప్పింది. నన్ను పట్టుకోండి-

జైల్లో పెట్టింది. కాని...నన్ను పోషించే దమ్ములేక దాచిపెట్టే ధైర్యంలేక విడిచిపెట్టింది. అందుకే గాలించాను. ఇళ్ళన్నీ గాలించాను. వీధులన్నీ గాలించాను. ఇంతకాలం జైల్లోనే మ్రగ్గిన ఈ శరీరానికి యింత కూడబెట్టే టికాణాలేక, టికెట్ లేకుండానే ప్లాట్ ఫారమ్మీదకి వెళ్ళి గుర్రుపెట్టి నిద్రపోతున్న — బుర్ర మీసాల ఆసామి జేబులో చేయిపెట్టాను. ఓ పర్సు కొట్టాను (అంటూ జేబులోనుండి పర్సు తీసి ముద్దెట్టుకున్నాడు నవ్వుతూ) ఆ పోలీసు పోలయ్యకూడా ఇందులో భాగం కావాలట! భాగం... (నల్లి ఎవరో అడుగులు రావడం గమనించాడు) ఏడెవడు? వో. జేబులుకొట్టే జోగులుగాడా? ఏమిటి ఇలా వచ్చావ్? నీకూ పంచిపెట్టాలా? ఎందుకని? నువ్వూ చూశావా? చూస్తే నాకేం? చెప్పుకో! నీయిష్టమొచ్చినవాళ్ళతో చెప్పు! ఏమిట్రా చూశావు? స్టేషన్లో నిద్రపోయే ప్యాసింజర్ల జేబులు కొట్టడానికి నీ ఒకడికే హక్కుందా? ఎవరిచ్చారు నీకా హక్కు? పోలీసు వారేనా? వాళ్ళకో సగం పంచిపెట్టే అలవాటు కూడా వుందా? అవును... మీలాంటి అగ్రరాజకులు అంతకన్నా యింకేం చేయగలరు? ఏమిటీ? డబ్బెంత వుందో లెక్కించమంటావా? మర్యాదగా అందులో సగం పోలీసు పోలయ్యకూ ముట్టజెప్పమంటావా? నెవ్వర్ నెవ్వర్... అలా జరగడానికి వీల్లేదు. రాసి నాకే జైళ్ళూ, సంకెళ్ళూ, కొట్లూ కొత్తేమీ కాదు

వాటికీ నాకూ చాలా దగ్గర చుట్టరికం వుంది. నా బ్రతుకంతా జైల్లోనే గడిచిపోయింది. కావాలంటే జైలు గోడలలో వున్న ఒక్కొక్క యిటుకరాయినీ పలకరించు- నాకథ చెబుతుంది. యింకా నీకు ఓపికవుంటే ఆ జైల్లోని నాకన్నీటితో తడిసిన నేల నడిగిచూడు. నా గుండెలలో ముల్లు ఎంత విషాదంగా గడ్డ కట్టుకుందో చెబుతుంది. నువ్వెందుకు జేబులు కొడతావో నాకవసరం లేదు. కాని, నేనెందుకు దొంగతనం చేశానో తెలుసా నీకు? ఆకలి... మలమలమాడే ఆకలి. పేగులు దహించుకు పోయే ఆకలి. మండే ఆకలి గుండెల్ని పిండే ఆకలి. అందరికీ వుంటుంది. నో... నో... ఐడోంట్ యాక్సెప్టు... నా ఆకలి కేవలం నాలుగు మెతుకులు కడుపులోకి దిగితే చల్లారిపోతుంది. నా బతుకు తెల్లారిపోతుంది. కాని ఈ దేశంలో ఎందరో ఇంకెందరో ఆకలి తీరని మహానుభావులున్నారు. వేలు, లక్షలు, కోట్లు కూడబెట్టినా తీరని ఆకలి వారిది. వారికీ నాకూ ఏమిటి పొత్తు? అసలు వాళ్ళూ దొంగలే! ఘరానా దొంగలు. ఒకరికి పదవుల ఆకలి- మరొకరికి పెదవుల ఆకలి- ఇంకొకరికి కూడబెట్టే ఆకలి. కూడులేని వారి వెచ్చని నెత్తురు త్రాగే ఆకలి. నాకన్నా వాళ్ళు ఘరానా దొంగలే. ఉద్యోగం... (నిట్టూర్చాడు. నీరసంగా రెండడుగులు వేశాడు) తల్లిదండ్రుల చెమటతో కూడబెట్టిన డబ్బుతో పాటు కాల

ముత్తాతల నాటి కొండ్రనేల అమ్మితే వచ్చిన బియ్యే
డిగ్రీ నాకో చిన్నవుద్యోగం యిప్పించలేక పోయింది.
కూడులేక చేయడానికి కూలీ, నాలీ లేక నా తల్లి మం
చానపడితే- ఆమె గొంతులో చిట్టెడు మందునీళ్ళు
పోయడానికి తాహతు లేకుండా చేసింది. నేను కష్ట
పడి చదివి సంపాదించిన డిగ్రీ నన్నూ, నా తల్లినీ, పెళ్ళి
కావలసిన నా చెల్లెల్ని బ్రతికించలేక- తెచ్చిన
అప్పులు తీర్చలేక పరువుగా నా తండ్రి మెడకో ఉరి
వేసుకొని దూలానికి వ్రేలాడుతూ ప్రాణాలు విడిస్తే-
కనీసం ఆయన్ని చూసి సానుభూతి చూపడానిక్కూడా
శక్తి లేకుండా చేసింది. బియ్యే డిగ్రీ- పెళ్ళి- హు...
నా చెల్లికి పెళ్ళిచేయలేని అసమర్థుణ్ణి చేసింది కూడా
డిగ్రీయే. అసలు నేనిలా దొంగలా మారడానికి కార
ణమే ఈ డిగ్రీ. అన్నీ పోగా, అందరూ పోగా మిగిలి
వున్న నా చెల్లెలిని ఒకింటిదాన్ని చేద్దామని- ఒకయ్య
చేతిలో పెట్టి గుండెలమీది కుంపటి దించుకుందామని
సంబంధం మాట్లాడాను- వెయ్యి రూపాయల కట్న
ముతో నా చెల్లెలి పెళ్ళి వైభవంగా చేద్దామని కలలు
గన్నాను. ముహూర్తం నిశ్చయించుకొన్నాం.

కాని డబ్బు కావాలి. ఆ డబ్బుకోసం కాలికి
బలపం కట్టుకొని తిరగని యిల్లులేదు, అడగని మనిషి
లేదు! కనీసం కూలి పనైనాచేసి, డబ్బు కూడబెట్టి
నా చెల్లి మెళ్ళో ఆమూడు ముళ్ళు వేయిద్దామనుకున్నా

ను. కాని ఈ దేశంలో నాకు పని దొరకలేదు. నా
చెల్లి పెళ్ళి కావడానికి నాకు సహాయంగానీ, సాను
భూతి గానీ దొరకలేదు: తెల్లవారితే పెళ్ళివారొస్తారు.
తెల్లవారితే నా చెల్లి ఒకింటిదై నూరేళ్ళు చచ్చగా
జీవిస్తుంది. పసుపు, కుంకుమతో పది కాలాల
పాటు ఆమె హాయిగా బ్రతకడానికి ఆమెకో తాళి
మెడలో పడుతుంది. విసిగి వేసారిన నాకు ఏ దారీ
కనిపించలేదు. పదే పదే నన్ను చూసి పకపకా నవ్వే
బియ్యే డిగ్రీని చూస్తే నా కడుపు మండింది. నా
కళ్ళలో కసి, కర్కశత్వం బియ్యే డిగ్రీని కాల్చి
వేసింది.

అంతే!

ఆ రాత్రి అర్ధరాత్రి నల్లని చీకటి! భూమినీ, ఆకా
శాన్నీ కమ్మిన చీకటి! అంతరాంతరాలలో అంధకా
రం కమ్మిన రాత్రి. మొదటిసారిగా నన్ను దొంగను
చేసిన ఆ కాళరాత్రి నన్ను శాశ్వతంగా దొంగగానే
బ్రతుకమని శాసించింది. కాలేదు తమ్ముడూ! నా
చెల్లిపెళ్ళి కానేలేదు. ఎందుకో తెలీదా? ఆ కాళ
రాత్రి నిద్రపోతున్న పెద్దిశెట్టిని లేపి, కత్తిచూపి
కావలసినంత డబ్బుపుచ్చుకొని ఇంటికి చేరాను. నా
చెల్లిని పెళ్ళికూతుర్ని చేయడం, నా యింటికి పోలీ

నులు రావడం, నాచేతులకు బేడీలు వేయడం, నా మురిపాల చెల్లి బ్రతుకులో నిప్పులు పోయడం ఒక్క నిముషంలో జరిగిపోయిందిరా! ఆమె మెడలో పడుతుందని ఆశించిన పసుపుతాడే- అది - పలుపు తాడై చివరకు ఉరి తాడుతోనే ఆ చిన్నారి చెల్లి జీవితం పరిసమాప్తమై పోయింది. అప్పట్నుంచే నేను మారిపోయాను. చదివి సంపాదించిన బియ్యే డిగ్రీ నన్ను బికారినే కాదు, దొంగను కూడా చేసింది సంఘంలో నాకింత పరువూ, మర్యాదా లేకుండా చేసింది. అందుకే తెల్లారని చీకట్లోకి పయనిస్తున్నాను. చల్లారని మంటల్లోకి పయనిస్తున్నాను.

ఓ - పోలీసు పోలయ్యగారా? రండి! ఏమిటిచేయి జాపుతున్నారు? వాటా కావాలా? నాలోని మంచినీ, మానవతనూ చంపుకుని, జీవితాన్ని చీకటిచేసుకుని బ్రతికినంతకాలం ఒంటరిగానే తలొంచుకుని తప్పుకు తిరుగుతూ తప్పుకుంటూ ఇలా కాలం వెళ్ళబుచ్చుతున్న నన్నూ వాటా అడుగుతున్నావా? ఈ పాపంలో నీకూ భాగం కావాలా? ఏమిటీ? నీ కొడుకు బియ్యే పరీక్షలకు వెళ్ళడానికి యింకా జీతం కట్టలేదా? వచ్చే నెలజీతం వడ్డీలకే చాలేదా? ఫీజు చెల్లించకపోతే యిన్నేళ్ళూ చదివిన నీ కొడుకు జీవితం వ్యర్థమై

పోతుంటా? అవును. వ్యర్థమైపోతుంది. అర్థంలేని ఆగాధంలోబడి అడుగున పడిపోతుంది. అప్పుడు నువ్వూ, నీ కొడుకూ ఏడ్చినా, కన్నీళ్ళన్నీ ధార పోసినా ఏడాది వెళ్ళేదాకా మళ్ళీ పరీక్షలు రావు. నిజమే ముందు నీ కొడుకుని పరీక్షలకు పంపు. డబ్బు నేనిస్తాను. (అంటూ జేబులోనుండి పర్సుతీశాడు. గబగబా అందులోంచి డబ్బుతీశాడు. అందులోంచి ఒక ఉత్తరం జారి క్రిందపడితే దాన్ని అందుకుని ఆదుర్దాగా చదడం మొదలెట్టాడు. అతనిముఖంలో రంగులు మారాయి. కాగితం మడిచి, ఆ డబ్బుతో కలిపి మళ్ళీ పర్సులో పెట్టి జేబులో పెట్టుకున్నాడు) వీల్లేదు పోలయ్యగారూ! ఈ డబ్బులో ఒక్క చిల్లి గవ్వకూడా ఖర్చుపెట్టడానికి వీల్లేదు. ఏమిటి? నన్ను మళ్ళీ జైలుకే పంపిస్తావా! ఇంతకుముందే జైలు గోడలకూ, ఆ గోడల్లో వున్న ఇటుకలకూ, నాకూ పరిచయం వుంది పోలయ్యగారూ! ఆ రాళ్ళకు మాటలు రావుగానీ... మీరు చితకబాది. ఆ చీకటి కొట్లోకి వెళితే పలకరించింది, పరామర్శించింది కాస్త సానుభూతి చూపి, కారుతున్న కన్నీళ్ళను తుడిచింది ఆ యిటుకరాళ్ళేనయ్యా! మీకన్నా అవేనయం! నా-ఇవ్వను నువ్వేంచేసినా యివ్వను ఎందుకో తెలుసా?

ఈ ఫస్టులో డబ్బుతో మరో జీవితం చిగురించ బోతుందయ్యా! ఆ స్టేషన్‌లో నిద్రపోతున్న అతను పెళ్ళయిన తన కుమార్తెకు యిస్తానని యిల్లు అమ్మి తెచ్చిన డబ్బయ్యా యిది. ఈ డబ్బుతో తన కూతురు ఆనందంగా కాపురం చేసుకుంటుందని - ఆ తర్వాత, అల్లుడి వత్తిడి యిక వుండదని ఆశించి తనకు మిగిలివున్న యిల్లుకూడా అమ్మి తనకూతుర యిల్లు నిలబెట్టాలని కలలుగంటూ తెచ్చాడయ్యా పాపం ఆ ఆసామి! అందుకే తిరిగి యిచ్చేస్తాను. ఈ డబ్బు మళ్ళీ అతనికే యిచ్చేస్తాను. ఆ మాట చెప్ప డానికి విరారెవ్వరు? చూస్తూ చూస్తూ ఒక ఆడపిల్ల నిండు కాపురంలో నిప్పులు పోయడం నాకిష్టంలేదు. నీ కొడుకు పరీక్షలు రాయలేకపోతే నాకేం? నాఆకలి తీరకపోయినా ఫర్వాలేదు. వస్తులతో, అవస్థలతో అవురావురుమనే వూపిరి ఆకాశంలో కలిసినా నాకు దిగుల్లేదు. ఆకలి ఎప్పుడూ వుండేదే!

కాని...

ఆడపిల్ల నిండుజీవితం - ఈ డబ్బు యివ్వకపోతే ముండలా బద్దలై పోతుంది. కట్నం యిస్తేనే కాపురం

నిలువునా బ్రతైపోవాలా? ఒక అమాయకురాలి కన్నీళ్ళలో నేనూ, నా జీవితం కొట్టుకు పోవాలా? వీల్లేదయ్యా! ఇక అలా జరగడానికివీల్లేదు. నేనూ మనిషినవుతాను. బ్రతుకులో యింత మందితనం నింపుకుని యిప్పటి దాకా వంచనతో కాలిపోయిన నా జీవితాన్ని మానవత్వంతో మళ్ళీ చిగురింప జేసు కుంటాను. దొంగతనం మానేస్తాను. ఏమిటి? దొంగ- దొంగేనా? అతనికీ సంఘంలో ఒక్కసారైనా మని షిగా చెలామణి అయ్యే హక్కు, అవకాశం లేనే లేదా? అయినా సరే... ఈ సంఘం ఏమనుకున్నా సరే...సమాజం నా నెత్తిమీద దుమ్ముపోసినా సరే... చట్టం నామీద వ్యతిరేకంగా పాతనేరాలు మోపి జైల్లో శాశ్వతంగా బంధించినా సరే! నేను దొంగ తనం చేయను- చేయలేను. నేను చేస్తున్న అమానుష కృత్యాలకు అమాయకుల బ్రతుకులు ఆరిపోవడానికి వీల్లేదు. నా ఆకలి తీర్చుకోవడానికీ, ఈ మంటలు చల్లారడానికి మరో జీవితమ్మీద నిప్పులుపోసి కాల్చివేయడం నాకిష్టంలేదు!

ఓ ... ఆసామిని కూడా తీసుకు వచ్చారా పోలయ్య గారూ! చెప్పండి ఆయనతో నేనో పాత నేరస్థుణ్ణని. మళ్ళీ జేబు కొట్టానని చెప్పండి అయ్యా ఆసామి గారూ! నిజమే బాబూ జేబుకొట్టింది నేనే. దహించి వేస్తున్న ఆకలి తీర్చుకుందామని మీ జేబు కొట్టినమాట నిజమే- కానీ, మీడబ్బులో ఒక్క పైసా

కూడా ముట్టుకోలేదు. ఎందుకో తెలుసా? నీకూతురి
నూరేళ్ళ జీవితం ఈడబ్బులోవుంది. యింతకాలంనువ్వు
తలదాచుకున్న నీడ ఈపర్సులో వుందయ్యా! అందుకే
అందుకే బాబూ. నేను ఖర్చుపెట్టలేదు. (జేబులో
నుండి తీశాడు) ఇదిగో బాబూ! మీ పర్సు తీసు
కోండి. లెక్కచూసుకోండి. తక్కువయితే నాప్రాణం
మిగిలివుంది. దాన్ని యిక్కడే విడిచి ఆ తరుగు
పూడ్చి మీ అమ్మాయి బ్రతుకు బంగారం చేయండి
తీసుకోండి. (అంటూ పర్సు విసిరేశాడు) నేను
దొంగనే బాబూ! ఆకలి దొంగను. అంతేగాని
ఘరానా దొంగనుకాను బాబూ! ఈ పోలీసు
పోలయ్యలాంటి పెద్ద పెద్ద బురఖాల చాటున తప్పులు
దాచుకున్న దొంగను మాత్రం కాదుబాబూ! అక్క
ర్లేదు - మీరిచ్చే ఆ పదిరూపాయలు నాకక్కర్లేదు.
యిప్పుడు నాకు ఆకలిలేదు- తీరిపోయింది. నా మనసు
ఒక మంచి పనితో తృప్తిపడింది. మీ అమ్మాయి
నిండుగా నూరేళ్ళూ కాపురం చేస్తే - ఇక నాకు
యెప్పుడూ ఆకలి కానేకాదు. నేనిప్పుడు మారి
పోయాను. దొంగను కాదు. ఒక మనిషిని పోలయ్య
గారూ! రండి. ఇవిగో చేతులు. సంకెళ్ళు వేయండి.
మీ చేతుల్లో సత్తువవుంటే ఆ లాఠీతో చితక బాద
డండి - నావళ్ళు సిద్ధంగానే వుంది. కమాన్! కొట్టండి.
అంతేగాని యింతకాలం నేను చేసిన పాపాలతో నేరా
లతో కుళ్ళిపోయిన ఈశరీరాన్ని పోషించుకోవడానికి

మళ్ళీ మరో నేరం చేయను. చేసి మీకు భాగం పంచ
పలేను - ఏమిటీ ? నన్ను విడిచిపెడుతున్నారా !
క్షమించి వదిలిపెడుతున్నారా ? నేను దొంగనయ్యా!
ఆకలి దొంగను, పోలీసయ్యగారూ ! మీలో జాలీ,
దయా వుంటే వాటిని అలానే వుంచుకోండి కాని,
నాలాటి నేరస్థుల్ని విడిచిపెట్టి ప్రభుత్వం దృష్టిలో
మీరు నేరస్థులు కావద్దు మీ ఉద్యోగ ధర్మానికి
మీరెప్పుడూ అన్యాయం చేయొద్దు. ఇందుకే రండి.
అరెస్టు చేయండి నన్ను జైలుకు పంపండి నేను
దొంగను. ఆకలి దొంగను. రండి... అయితే నేనే
వస్తున్నాను- ముందుకొస్తున్నాను. ఒక వేళ నా మీద
సానుభూతితో మీరు విడిచిపెట్టినా నేనే వెళ్ళి
స్టేషన్‌లో హాజరవుతాను శిక్ష అనుభవిస్తాను. వస్తా !
(అంటూ గబగబా ముందుకు వెళ్ళిపోయాడు)

[ తెర జారును ]

# కోతలరాయుడు

(తెర తీయగానే హేటు, బూటు, సూట్‌తో వున్న ఒక వ్యక్తి ప్రవేశించి నాలుగువైపులా క్షణకాలం పరికించి ఒక సిగరెట్ తీసి వెలిగించి గట్టిగా నాలుగు దమ్ములు లాగి)

లేడీస్ అండ్ జెంట్స్... బాయస్ అండ్ గరల్స్ .. ముందు నే నెవరోన్న మీకు తెలుసా? నాన్‌సెన్స్ నేను చెప్పందే నే నెవరోన్న మీకెలా తెలుస్తుంది? బై దిబై చెప్పినా నేనొక మనిషిని అని చెప్తారు. కాని నేను మనిషిని కాదు. పశువును అంతకన్న కాదు గుండెలేని బండరాతి దేవుణ్ని అంతకన్న కాను. నిజం చెప్పాలంటే మీలాంటి అణాకాని మనిషిని అసలే కాదు. నేను ఇప్పుడే అమెరికానుంచి దిగబడ్డ అప్-టు-డేట్ మనిషిని నా పేరు S. R. జా.

నాన్‌సెన్స్. ఎందుకలా నవ్వుతున్నారు? జూ ఏమిటీ జంతువు ప్రదర్శనశాల్లా అనేనా? అమెరికాలో పేర్లన్నీ యిలాగే వుంటై. నిజం చెప్పాలంటే ఆంధ్రాలో నా అసలు పేరు సన్యాసిరాజు ఆ పేరునే అమెరికాలో 'S R. జూ' గా కుదించివారేశారు అమెరికాలో మనిషి పొట్టిగైనా ఊరుకుంటారుగాని పేరు పొడుగైతే ఊరుకోరు

ఏమంటున్నారూ? మీ పేర్లను అమెరికాలో ఎలా కుదిస్తారో చెప్పమంటున్నారా? చెప్తాను నీ పేరు బంగారం కదూ? అదే అమెరికాలో 'B. G. రమ్' అని పిలుస్తారు. అలాగే సుబ్బయ్యను 'సుయ్' అనీ రామయ్యను 'రయ్' అని, కోటయ్యను 'కోయ్' అనీ కుదిస్తారు.

అమెరికానుంచి నేనిక్కడ కెందుకొచ్చానని అడుగుతున్నారా? ఈ పల్లెసీమల్ని కళ్ళారా చూసిపోదామనే వచ్చాను. అమెరికాలో మన పల్లెల్ని గురించి స్వర్గాలనీ, ప్రకృతి సౌందర్యానికి అసలు సిసలైన ప్రతిరూపాలనీ ఎంతో గొప్పగా పొగుడుతుంటారు. నిజంగా మన ఆంధ్రాపల్లెసీమల కన్న అమెరికాలో పల్లెకాడ సీను బాగుంటుందని నేను చెపుతున్నాను.

నిజం చెప్పాలంటే ఏముందీ పల్లెల్లో? ఎటుచూసినా పూరిగుడిసెలూ, మురికిగుంటలూ... సుందరమైన దోమలు కనిపిస్తున్నాయిగాని పాశ్చాత్యకైనా అందమైన భవనాలు కనిపించడంలేదు. ఏ యింట్లో చూసినా చీకటీ, రోగము విలయ

తాండవం చేస్తున్నవి. ఈ యుగములో ఈ పల్లెలు బాగు
పడవు నా వాక్కు నిజంగా వేదవాక్కు.

ఏమంటున్నారూ? నా గురించి పూర్తిగా చెప్పమం
టున్నారా? చెప్తాను. మీకోసం కాకపోయినా నా ఆత్మ
సంతృప్తి కోసమైనా గొప్పను నేను చెప్పకపోయినా
నిజం చెప్పాలంటే నేను పుట్టింది భారత దేశంలో పాలుప
ట్టింది పారిస్‌లో. ఓనమాలు నేర్చుకుంది వాషింగ్టన్లో.
అన్ని విద్యల్లో ఆరితేరింది అమెరికాలో. అమెరికాలో నేను
చదవని చదువంటూ లేదు. పాస్ కాని కోర్సంటూ లేదు.
మెడిసిన్లో ఫస్టు, సైన్స్‌లో ఫస్ట్, రన్నింగ్‌లో ఫస్ట్, కన్నిం
గ్‌లో ఫస్ట్, ఈటింగ్‌లో ఫస్ట్, చీటింగ్‌లో ఫస్ట్, అన్నిటిలో
నా అపారమైన అనుభవాన్ని గురించి అమెరికా ప్రభుత్వం
నాకు XYZ అనే స్పెషల్ డిగ్రీ బహూకరించింది. నాన్
సెన్స్! ఎందుకలా నవ్వుతారు? ఈ డిగ్రీ గురించి మీరా
రెప్పుడూ వినలేదా? అఫ్‌కోర్స్ మీరెవరు వినకపోవచ్చు. నిజం
చెప్పాలంటే ఈ XYZ డిగ్రీ చాలా గొప్పది. ఈ డిగ్రీ
ఈ ప్రపంచంలో ఇంతవరకు ఎవ్వరికీ రాలేదు. ఆ డిగ్రీ పుచ్చు
కున్న ఘనత ఈ ప్రపంచంలో తొలిసారిగా నాకే దక్కింది.
అందుకే అమెరికాలో ఉన్నతాధికారి మొదలుకొని భిక్షాధికారి
వరకు, కార్మికుడు మొదలుకొని కోటీశ్వరుని వరకూ నేను
తెలినివాడంటూ లేడు. నాకు అమెరికాలో అంత పేరు
ప్రతిష్టలున్నాయి.

నిజం చెప్పాలంటే నాలాటి వ్యక్తి ఈ ప్రపంచంలో
నూటికీ కోటికీ ఏ ఒక్కడో పుడతారు. నేను చూడంది లేదు

దేవుణ్ని తప్ప; నేను తాగందిలేదు విషం తప్ప; నేను అనుభ
వించందిలేదు మృత్యువు తప్ప; నేను తినందిలేదు గడ్డి తప్ప;
నేను చేయందిలేదు హత్యతప్ప.

ఒకసారి అమెరికా ప్రభుత్వం నా దగ్గరకొచ్చి
రోజుకు పాతికవేల డాలర్లిస్తాం మా దగ్గర ఉద్యోగం చెయ్య
మన్నారు. అప్పుడు నేను "నో" అన్నాను. అదే అమెరి
కాలో ఒక ప్రయివేటు కంపెనీ గంటకు లక్ష డాలర్లిస్తాం మా
కంపెనీకి డైరెక్టర్‌గా వుండమన్నారు. "డోంట్ కేర్"
అన్నాను. అక్కడే మరో ఫరమ్ పూటకు కోటిస్తాం. మా
కంపెనీలో మేనేజింగ్ పార్టనర్‌గా వుండమన్నారు. "ఇంపాజ్
బుల్" అన్నాను. అలా ఎందుకన్నాను? నాన్‌సెన్స్!
ఆ విషయం మీకెలా తెలుస్తుంది నేను చెప్పంది?
నేను పుట్టింది ఘోర దరిద్ర దేవత ప్రళయతాండవం చేసే,
ఈ పవిత్ర భారతదేశంలో. నా మేధస్సు, నా తెలివి, నా
చీమూ, రక్తమూ, అన్నీ నా దేశానికే ఉపయోగపడాలనే
ఉద్దేశంతో అమెరికాకు టాటా చెప్పి, గుడ్‌బై కొట్టి మన
ఆంధ్రదేశానికొచ్చి మకాం పెట్టాను.

వాట్? నాకు పిల్లలెంతమందనడుగుతున్నారా?
నాన్‌సెన్స్ నాకింకా పెళ్ళేకాలేదు. ఎందుకు చేసుకోలేదని
అడుగుతున్నారా? పిల్ల దొరక్కమాత్రం కాదు. ఇది కలి
యుగం కాంతల యుగం. కుర్రపిల్లలు దొరకలేదంటే
ఆశ్చర్యంపడొచ్చుగాని కన్నెపిల్లలకు మాత్రం కొదువలేదు.
వందలమంది కన్నెపిల్లలు పెళ్ళీడుకొచ్చి తమ తల్లిదండ్రుల
గుండెలమీద కుంపటై కూర్చున్నారు.

ఆ ఆడపిల్లల తండ్రులు కట్నాలు లేని పెళ్ళికొడుకుల కోసం, దొంగలకోసం కాచుకునే పోలీసుల్లా వేచియున్నారు. కాని మనదేశ లో ఈ కట్నానికి ఎంతో ప్రాముఖ్యతుంది. తలిదండ్రులు తమ కుమారులను యింజనీర్లు చదివించినా, లాయర్లు చదివించినా, డాక్టర్లు చదివించినా ఆకట్నంకోసమే తమ బిడ్డల చదువుకోసం ఖర్చుపెట్టిన డబ్బును వడ్డీతో సహా ఆడపిల్లల తండ్రి దగ్గర పుచ్చుకోవడమే ఈ కట్నాల పరమార్థం. కన్నెపిల్లల భావిజీవితాలకే ఒక గొడ్డలిపెట్టుగానున్న ఈ కట్నాలను యువతరం కాదన్ననాడే ఆడపిల్లల కన్నవాళ్ళు నిశ్చింతగా ఉండగలుగుతారు. అలా కానినాడు వాళ్ళకు ఈ జన్మలో సుఖంగాని, శాంతిగాని ఉండదు. ఇది సత్యం.

ఇంకెందుకు నా సంగతే చూడండి. అమెరికాలో ఒక ఉన్నతాధికారి వాళ్ళమ్మాయిని చేసుకుంటే ఏడు మేడలిస్తానన్నాడు...మేడలంటే మనమేడల్లా బోడి మూడంతస్తుల మేడలు కాదు, మేడకు ముప్పయి అంతస్తులు ... అంతస్తుకు ముప్పై గదులు ఐనా వద్దన్నాను. ఎందుకో తెలుసా? అప్పటికే ఆ పిల్ల ముచ్చటగా ముగ్గురి భర్తలకు విడాకులిచ్చింది. అమెరికాలో భర్తలకు భార్యలు విడాకులివ్వడం చాలా ఈజీ అది ఆ దేశంలో ఒక పెద్ద ఫ్యాషనూ కల్చర్ గూడ. ఇకపోతే అక్కడే మరో తండ్రి తన కూతుర్ని చేసుకుంటే ఏడు ఇటుకలిస్తానన్నాడు. ఏం యిటుకలు! బంగారపు యిటుకలు. ఐనా తిరస్కరించాను. ఎందుకని! పెళ్ళి కాకముందే ముద్దుగా యిద్దరు పిల్లల్ని కన్నందుకు. అక్కడే మరో పెట్టుబడిదారుడు తన కూతుర్ని చేసుకుంటే మూడు విమానాలూ, ఏడు ఓడలూ

ఇక పదవులంటారా అవి సెంట్ పర్సెంట్ పాపాల పుట్టలు. ఆ పదవులు కాపాడుకోడానికి అవినీతికి దిగజారాలి. అన్నిటినీ అందరినీ దూరం చేసుకోవాలి అబద్ధాలు ఆడాలి. అక్రమాలు చేయాలి. హత్యలు చేపట్టాలి సత్యాన్ని తుద ముట్టించాలి. అధికారమనే అందలమెక్కాలి అందుకే పాప పంకిలమైన ఆ పదవులంటే నాకు ఒళ్ళు మంట, కళ్ళు మంట, గుండె మంట.

ఇక అసలు విషయానికొద్దాం. నే చెప్పేది మీకర్థమైతే కోరుకునే దేమిటంటే నాకు మీ ఊరిలో ఒక చిన్న కుటీరం కట్టించండి రోజూ కాస్త యింట్లో అన్నం పెడుతుండండి అప్పుడు నేనూ మీతో పాటు మీ దగ్గరే వుంటూ, మీ కష్టసుఖాల్లో పాలు పంచుకుంటాను. నాన్సెన్స్! ఏమిటి మళ్ళీ మీ గుసగుసలు! నాకేం ఆస్తి లేదనుకుంటున్నారా? లేక నేనేం బికారి ననుకుంటున్నారా? ఎన్నటికీ కాదు. నిజం చెప్పాలంటే నేనో కోటీశ్వరుణ్ణి. మా తాత మాజీ కేంద్రమంత్రి మా తండ్రి మాజీ రాష్ట్రమంత్రి, వాళ్ళిద్దరూ పదవుల్లో వుంటూ ప్రజాసేవ పేరుతో వాళ్ళ పదిల సొమ్ము కొన్ని కోట్లు సంపాదించారు. ఉన్నట్టుండి ఒకసారి హార్టు ఎటాక్ వచ్చి పరలోకానికి విశ్రాంతికోసం వెళ్ళారు. ఒకసారి అంత ఆస్తికీ నేనొక్కణ్ణే వారసుణ్ణయ్యాను. కాని ఆ డబ్బు ఎవరిది? ఎలా వచ్చింది? అని నన్ను నేను ప్రశ్నించుకున్నాను. యిది ముమ్మాటికీ ప్రజల డబ్బేనని గ్రహించుకున్నాను. వెంటనే ఖజానా బద్దలుకొట్టాను. చిత్తు కాయితాల్లా కట్టలుకట్టి గది నిండా గుట్టలు గుట్టలు పడివున్న ఆ నోట్లను చూచి నాకు

నేనే ముందు ఆశ్చర్యపడ్డాను. ఆ తర్వాత సిగ్గుపడ్డాను. దేశంలో డబ్బు కొందరికింత కరువొచ్చిందో సాక్షాత్కారమైంది ప్రతి భాగ్యవంతుడూ ఇలా డబ్బు దాచేస్తే ఈదేశ మేమై పోతుంది? ఈ ప్రజలేమై పోతారు? అన్న ప్రశ్నలు కంది తీగల్లా నా మెదడును చుట్టడం ప్రారంభించినై. ఆ డబ్బు ఏం చెయ్యాలి? ఎవరికివ్వాలి? అన్న ఆలోచనలు జలగల్లా నా మనసును పట్టి పీడించసాగాయి. ఇంకా మా తాత తండ్రులు ఎక్కడ ఏం దాచారోనని వెదుకులాటలు ఏకధాటిగా మేడంతా వెతికాను. ముందు దొడ్డి తవ్వించాను. అందులో బంగారం బైటపడింది. ఆ తర్వాత బాత్ రూమ్ బద్దలు కొట్టించాను. భూమిలో వజ్రాలు దొరికినై.

ముందు దొరికిందంతా ప్రభుత్వాని కప్పగిద్దామను కున్నాను. కాని పెద్దసముద్రంలో కడివెడు మంచినీళ్ళు పోయడం నిరర్థకమనిపించింది. ఆ డబ్బంతా బీదలకు పంచి పెట్టడం మంచిదనుకున్నాను. కాని అందుకు నా అంతరాత్మ అడ్డు చెప్పింది. బీదలను బిచ్చగాళ్ళుగా చేయవద్దని నన్ను హెచ్చరించింది. డబ్బుతో పేదలు బాగుపడకపోగా త్వరగా చెడిపోతారని బోధించింది. నిజమే తేరగా వచ్చే డబ్బు మనిషిని త్వరగా చెడగొడుతుంది. నేను యిచ్చిన డబ్బుతో ఒకడు తాగుబోతు కావచ్చు. మరొకడు తిరుగుబోతు కావచ్చు యింకొకడు పోకిరిపోతై పనిమానేసి బజార్లన్నీ బలాదూరుగా చక్కర్లుకొట్టొచ్చు. అందుకే పేదలకు డబ్బివ్వడం మానుకున్నాను. కష్టం చేసుకునేవాళ్ళ బ్రతుకుల్లో

నా కరెన్సీతో కలతలు రేవకూడదనుకున్నాను. ఐతే ఆ డబ్బును ఎలా సద్వినియోగ పరచాలని గంటల తరబడి ఆలోచించాను. చివరకు మానవసేవకన్న పశువుల సేవయే ఉత్తమోత్తమమని నిర్ణయించుకొన్నాను. వెంటనే ఏడు మేడలకు ప్లాన్స్ సిద్ధము చేయించాను. టెండర్ల ద్వారా కంట్రాక్టర్లను పిలిపించాను. వాళ్ళకు కోటిరూపాయలు ముందుగానే ఇవ్వాల్సివచ్చింది. కాని వాళ్ళింతవరకు మేడలకు పునాదులే లేవలేదు. కారణమడిగితే సిమెంటు దొరకలేదని ఒకరు యినుము కొరతని మరొకరు కుంటిసాకులు చెప్పారు. అదీ నిజమే మరి, అసలు మనదేశములో మనకు ఏది చాలినంత దొరుకుతుంది? నిజానికి కరువుకు మారుపేరు మనదేశము. నాయకులు వేసేపునాది రాళ్ళలాగే ఆ మేడలు కూడా పునాదుల్లోనే ఆగిపోయ్యాయి. కావలసిన డబ్బంతా ముందే పుచ్చుకొని కాంట్రాక్టర్లు మాయమైపోయ్యారు. ఆ క్షణమే ఈ నీతిలేని మనుషజాతిమీద విరక్తి కలిగింది. మానవత్వము లేని ఈ మనుషుల్ని నమ్మేకన్న పవిత్రతకు మారుపేరయిన పశువుల్ని నమ్మడం నయమనుకున్నాను. అసంపూర్తిగా మిగిలిపోయిన ఆ మేడలన్నిటిని పశువులపేర రాసి పారేశాను. యీ ప్రపంచములో తొలిసారిగా పశువులకు రెస్టుహౌస్ నిర్మించిన ఘనత నాకే దక్కింది. మనుషుల్లో అనాధల్లాగే జంతువుల్లోగూడ దిక్కులేని వెన్నో వుంటాయి. అడిగి తమ కోరికలు సాధించుకోడానికి మనుషులకు నోరుంది. కాని పశువులకు నోరిచ్చి అడిగే అవకాశము లేకుండా చేశాడు

భగవంతుడు. ఈ విధముగా పశువులకు తీరని ద్రోహము చేశాడా దేవుడు,

రోడ్ల వెంటబడి ఎంగిలాకు లేరుకు తినే ఆవుల్ని, ఇల్లూ వాకిలీ లేక బురద గుంటల్లో రెస్ట్ తీసుకొనే వరాహాలను, వానకూ, ఎండకూ తడిసిపోయే గార్ధభాలను మునిసిపాలిటీ వాళ్ళ కబంధ హస్తాలకు చిక్కి తమ ప్రాణాలను కోల్పోయే కుక్కల్ని చూచినా మనసెంతగానో పరితపించింది. ఈ దేశములో పశువులు ఎంత వెనుకబడుతున్నాయో నాకిప్పు డర్థమైంది? అలాంటప్పుడు వాటి సుఖశాంతులకోసం మనం ఎందుకు ప్రణాళికలు సృష్టించకూడదు? అసలు సోషలిజానికి అర్థమేమిటి? సమానత్వమని. మనుషులతో సమానంగా పశువుల్ని చూచినప్పుడే ఆ సోషలిజానికొక అర్థము. ఈ విషయముమీదనే ప్రభుత్వానికి పాతిక పేజీల అర్జీ రాసి పంపాను. ఇంతా అక్కణ్ణుంచి సమాధానము రాలేదు. బహుశా నా అర్జీని చిత్తుబుట్ట దాఖలా చేసుంటారు. నాకు తెలుసు ప్రభుత్వం చెడుపనుల కిచ్చినంత ప్రోత్సాహము మంచి పనుల కివ్వదు. బ్రాందీ షాపులకు లైసెన్సిస్తుందిగాని బియ్యపుకొట్లు కివ్వదు.

ప్రభుత్వం సంగతలా విడిచిపెట్టండి మీరయినా పశువులు మీ పాలిట కల్పవృక్షాలు. పశువులు ప్రొద్దస్తమానం మీ పొలాలు దున్నుతున్నై, సూపరుకన్న బలమయిన ఎరువు లిస్తున్నై. తమ రక్తాన్ని పాలగా మార్చి మీ కందిస్తున్నవి తమ చర్మాన్ని మీకు చెప్పులు కుట్టిస్తున్నవి. తమ కొమ్ములతో మీకు దువ్వెనలు చేస్తున్నవి. అంతటి

ఉత్తమమైన పశువులకు మీరు గడ్డి పెట్టడం భావ్యంగాదు. మీరు హాయిగా యిళ్ళలో వుంటూ వాటిని మాత్రం వాకిలి ముందు, ఎండలో, వానలో, చలిలో వుంచడం న్యాయం కాదు. నా మాట విని పశువులకు కూడా మీతోపాటు సమాన హక్కులు, అవకాశాలు కలిగించండి

అసలు ఆ పశువులు పూర్వ జన్మలో మీలాంటి మనుషులేనన్న సంగతి మరిచిపోకండి. మీరు సత్యాన్ని తెలుసుకోకుండా పశువుల్ని హింసిస్తే వచ్చే జన్మలో మీరు గూడా పశువులుగా పుడతారు

(ఒక్కసారి ఉలిక్కిపడి, రాళ్ళు దెబ్బలు తనమీద పడుతున్నట్లు నటిస్తూ) ఏమిటి? ఏమిటీ ఘోరం? మంచి చెప్పినందుకు నామీద రాళ్ళా, దెబ్బలూ విసురుతున్నారా? నిజమే మరి. మీకు మంచి రుచించదు. చెడులో వుంటూ చెడులో బ్రతుకుతూ, పూర్తిగా చెడిపోయిన మీకు మంచి తనము మహాపరాధముగానే వుంటుంది మంచిని పెంచలేని మీరే మంచిని చంపుతారనడానికి గాంధీజీ మరణమే ఒక ప్రబల నిదర్శనము.

సముద్రములో ఉప్పునీరులా ఈ లోకమునిండా చెడు నిండిపోయింది. నిజముగా మిమ్మల్ని బాగుచెయ్యడానికి ఈ యుగము చాలదు. బంగారపు పళ్ళేలలో భుజిస్తూ వెండిగ్లాసులతో కాఫీ సేవిస్తూ, పట్టు పరుపులమీద పవళించే నేను మీకు సేవచేయాలని వస్తే దెబ్బలతో కొడతారా? అదీ రాతి దెబ్బలతో. ఏ పశువులకోసము నేను మీచేత దెబ్బ

దెబ్బలు తిన్నానో ఆ పశువుతోనే వీరాకు బుద్ధి చెప్పిస్తాను. వెంటనే పశువుల సంఘాలు పెట్టి, ఆ పశువులచేత వీరా పనులు చేయకుండా స్ట్రయిక్ చేయించి, వీరాకు తగిన గుణపాఠము నేర్పకపోతే నా పేరు S. R. జు గాసే కాదు. వాడిక్రింద XYZ సాక్షిగా ఇదే నా శపథము! మానవత్వము లేని మనుష్యులు డౌన్ డౌన్! ప్రజాసేవ చేసే పశువులు వర్ధిల్లాలి ...ఈ మనుష్యులు డౌన్ డౌన్!! పశువులు జిందాబాద్! (అని కేకలేసుకుంటూ లోనికి వెళ్తాడు.)

—: సమాప్తం :—

# విచిత్ర దుర్యోధనుడు

[బెల్‌బోటమ్ ప్యాంట్‌లో బిగించిన అరచేతుల చొక్కా, వెడల్పాటి బెల్టు, బూట్లు, కళ్ళజోడు, నెత్తిమీద దొరటోపీ, చేతిలో రోకలిబండలాంటి ఆయుధం అతని ఆభరణాలు. ఠీవిగా నడుస్తూ ఒక పట్టణంలో ప్రవేశించి అక్కడి వైభవోపేతమైన రంగుల్నీ, హంగుల్నీ పరీక్షగా చూస్తున్నాడు.]

దుర్యో :- ఆహా! ఏమీ మునిసిపాలిటీ వారి మురికిగుంటల మీద బారులుతీరి ముగ్గులుపెడుతున్న దోమల

భామల సౌందర్యము! అహా! ఇది ఏమి? నట్టనడి రోడ్డుమీద నడిసంద్రములాటి నీటిమడుగు కాబోలు! ఏమిటీ సువాసన? వికశించిన విరజాజులు గుబాళించే పరిమళంబు చందంబున సుగంధ ద్రవ్యముల బోలు వాసనలు నోరూరుటలు గొల్పుచున్నది. ఏమై యుండును? ఓహో! ప్లాటుఫారాలమీద తిండిలేక ఎండి - ఎండీ ... కడుపుమండీ - మండీ ... కృంగీ - కృశించి ఎక్కడో చనిపోయిన బిచ్చగాని శవము కాబోలు!

ఇది ఏమి? ఓహో! శునకరాజముకూడదిరే యున్నది. ఇదియునూ కన్నుమూసింది కాబోలు! మురిగి - పురుగులుపడి కంపుకొట్టుచున్ననూ పాపం! మునిసిపాలిటీవారికి తీరికలేక - తీసుకుపోయే దారిలేక ఎక్కడి శవాల నక్కడే విడిచిపెట్టారు. ముక్కులు పగిలిపోవుచున్నవి. కడుపు రగిలిపోవుచున్నది. ఏమీ చిత్రము? (అంటూ కొంతదూరం నడిచాడు) నడిరోడ్డు మీద కాసారమా? అవును. ఇయ్యది కాసారమే!

ఇందులకు సందియము లేదు. మురికిపట్టిన అధినేత లంతా ఈ మడుగులోనే స్నానముచేసి భగవంతుని ధ్యానము చేయుదురేమో! ఆహా! ఎంతటి అదృష్టము పట్టినది ఈ పట్టణ పరిపాలకులకు? మురుగుకాల్వల్లో మురికిని కడుగుకొనుటకు మునుపటిజన్మలో వారేమి పుణ్యము చేసినారో గదా!

ఆహా! ఏమిరా చల్లదనము! ఉల్లముస్సైతము అల్లనల్లన ఆకాశమునందాక తేలిపోవుచున్న ఈ ఆకస్మిక చల్లదనమునకు హేతువేమై యుండును? కాళ్ళ క్రింద మెత్తగా - వత్తుగా తగులుచున్నది. స్పాంజీ కాదుగదా! (మరో రెండడుగులు ముందుకు వేశాడు) కాదు కాదు. ఇది మున్సిపాల్టీవారు తోలిన చెత్త! బజార్లన్నీ వూడ్చి వూడ్చి ఆ కసవునంతా యిక్కడ కుమ్మరించినారు కాబోలు! మునురుపట్టిన కతంబున చెత్తంతా మురిగి - నీళ్ళల్లో మరిగి కాళ్ళకు చల్లగా యున్నది (పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ మరో చోటికి వెళ్ళాడు) ఈ నగరము ఎక్కువగా మంత్రిగారు

దర్శనము చేసుకొనలేదు కాబోలు. వారీ సుందర సౌధాల మధ్య అగాధాలవంటి అవురూప గోడ్లు తిల కించి వుంటే పట్టుపరువులే తెప్పించుకుని నట్టనడి వీధిలో పరిపించుకుని హాయిగా విశ్రాంతితీసుకుంటూ గోళ్ళు గిల్లుకుంటూ పరిలంచాన్నే మర్చిపోయి యుందురు. (మరి కొంత దూరం ఆశ్చర్యంగా చూశాడు)

ఏమిటీ విచిత్రము? ఇంతటి ప్రతిష్ఠ పేరుకుపోయిన ఈ నగరమ్మున ఒక్క దీపమూ కానవచ్చుటలేదు. కారణము గోచరించుటలేదుగదా! (ఇంకా కొంత దూరం నడిచాడు) మంచములోపడి చావు బ్రతుకుల్లోవున్న రోగిలా మసకమసకగా వెలుగుతున్న దీపము కన్పించుచున్నది. పాపము! దీపమ్ములార్పువారి దివ్యదృష్టికి రాలేదేమో! అహా! ఈ నగర సౌంద ర్యము నయనానందకరముగా నున్న కారణంబున కాబోలు...మనసు ఏలనో వేయి గుర్రాల పరుగులు తీయుచున్నది. దేవతలైననూ దివినుండి దిగివచ్చి-

తన్మయులై - తల్లక్రిందులై మళ్ళీ దేవలోక ప్రస్తా
వన మర్చిపోదురు. ఇది నిశ్చయము - నిస్సందే
హము- నిశ్చల నిశ్చయము. (మళ్ళీ కొంచముదూరం
నడిచాడు)

ఈ కాసారంబున కొంచము దప్పిక తీర్చుకొని
రోడ్డుప్రక్కన ఆకులురాలిన చెట్టునీడన విశ్రమించి
అటుపైన ప్రయాణము సాగించిన నన్ను కొట్టువార
లెవ్వరు? (చేతిలో వున్న ఆయుధము అవతల పడవేసి
మెల్లగా వంగి తేరిపార చూశాడు) ఆహా! ఏమీ
ఆనందపారవశ్యము? నీటిమడుగులో సాటి మనిషి
సాయము లేకుండానే స్నానమాచరించుచున్న దేవ
కన్యలు దిగంబరులై కళ్ళు మిరుమిట్లు గొలుపు
చున్నారే! నేనెంతటి అదృష్టముచేసి జనించితిని -
ఎంతటి అపురూపవరాలు బడసి భూమిమీద పడితిని!
ఎవరు వీరలు? (తిరిగి కళ్ళకు చేయి అడ్డం పెట్టు
కున్నాడు) నట్టనడివీధిలో పట్టపగలే దిగంబరులై -
దివ్యలోక సుందరీమణులై - స్నాన మాచరించు

చున్న వీరారలెవ్వరు? మాటవలుకుటకు నోరురాని
వీరు మానవమాత్రులు కారా ఏమి? అహో!
నేనెంత పొరపడితిని? ఎంతటి దిగ్భ్రాంతికి లోనయి
తిని! నిలువులోతు నీళ్ళలో నిజముగా దివ్యకాంతలే
దిగివచ్చి దిగంబరులై స్నానము చేయుచున్న వారలే
యని భ్రమపడితిని. కాదు కాదు. ఇవి మత్స్యములు.
ముత్యముల బోలు మత్స్యములు! నిర్వికారులై -
నిరాడంబరులై - నిరాధారులై నిత్యనూతనంగా
నృత్యములు చేయుచున్నవి! మృత్యువును సైతము
లెక్కచేయని పారవశ్యమున పరుగులు తీయుచున్నవి.
ఏ జాలరిబోలె వేచియున్నదో వీటిని దాచుకొను
టకు? (మరికొంత దూరం నడిచాడు ఏదో పరికించి
చూశాడు.)

ఓయీ! నీవు ఎవ్వాడవు? ఏకతంబున ఆ చెట్టుకు
వ్రేలాడుచుంటివి? పలుకవేమి? నీలో ప్రాణములు
లేవా? మాట్లాడవేమి? (పరీక్షించాడు) ఓహో! ఉరి
త్రాడుకు వ్రేలాడబడి ఆనందముగా ఊయలలూగు

చున్న నీవెంత ధన్యుడవోయీ ? నిజాయితీని నిలు
వునా పురికొసి- చెట్టుకు ఉరులవేసి- వూగిస్తూ-
నిరంకుశ పాలన సాగిస్తున్న పెత్తందారులెంత త్యాగ
మూర్తులు ! (దూరంగా పారచూశాడు) అచ్చట
మరో కాసారము కానవచ్చు చున్నది. అచ్చటి కరిగి
తృప్తిగా స్నానమాచరించి దాహము తీర్చుకొని
పోయెదగాక ! (అంటూ అటువేపు నడిచాడు. దిగ
బోయి కాలు జారిపడ్డాడు. ) అబ్బా ! గుడ్డివాళ్ళను
కుంటివాళ్ళను చేయుడానికి రోడ్డుమీద మట్టికుప్పలు
తోలిన పట్టణ ప్రాభవంబెట్టిదని వర్ణింతును ?
మోకాళ్ళు పగిలినవేమో ! (చూసు కున్నాడు.
దిక్కులుచూస్తూ) ఏమిటీ కిలకిలా రావములు ?
ఏమిటీ పెదవులపై లాస్యము చేస్తున్న హాస్యములు ?
ఎవ్వరివై యుండును ? ఆహా ! గుండెలను కదిపి
వేస్తున్న మందహాసములు ! ఏ నెచ్చెలి పెదవుల
నుండి రాలినవి ? ఓహో ! నీవా ? నీవా నన్నుచూసి
నవ్వినది ? నీవా పరిహాసాలతో నా ప్రాణములు
తీయుచున్నది ? ఎవ్వరిదానవు ? మాటలాడవేం?

అడుగుమిన్న కొలదీ పగలబడి - విరగబడి నవ్వుచూ
నన్నింకా కృంగదీస్తున్న నీవు ఎవ్వరిదానవు? ఏమిటా
వాలుచూపులు? వాలుజడను భుజముమీదుగా
వేర్లాడ వేసుకొని చేతిలో పట్టుకొని ఆడిస్తూ కొంటెగా
ఇంటిగా నా మాన ప్రాణములు తోడేస్తున్న నీవు
తెలుగుజాతి ఆడపడుచువు కావా? ఏమనుచుంటివి?
నావాళ్ళకు దెబ్బకుతగిలి - జబ్బులుపగిలి-చిత్తము
చిందరవందరై ఏ సందున దోదమా యని ఆలోచ
నలోపడ్డ నన్ను చూసి పరిహాసము చేయుచుం
టివా? వంచకీ! ఏమిటి? అందరిదానవా? అట్లయిన
కులసతుల పతులను యింటికి రప్పించి, వగలతో -
వయ్యారములతో మెప్పించి వళ్ళమ్ముకునే కులవంచ
కివా నీవు? పందెము వేసి పరువాలను పదిమందికి
పంచియిచ్చే పతితవా నీవు? అవును. ఇది స్వతంత్ర
భారతదేశం! వృత్తులు కోల్పోయి- మేధాసంపత్తు
లతో వృత్తులు పెంచి - ఉద్యోగ భవిష్యత్తును
బంగారము చేసుకునే భాగ్యనగరములో యింకనూ
కులవృత్తినే నమ్ముకొని - మానాభిమానాలు అమ్ము

కుని - జీవితాన్ని చీకటి చేసుకున్న దొరసానివా
నీవు? ఛీ! ఛీ! మగతనము లేదని మదనపడే నీ పండ
తనమును నేను అసహ్యించుకొంటిని! నన్నొక
అసభ్యురాలిగా జమకట్టితివి? (మళ్ళీ వెనక్కితిరిగాడు)
పావలాకు పదినిముషాలు సుఖాన్ని పంచిపెట్టే ఒక
పతిత పరిహాసించిన పిదప యిక నాకీ ప్రాణములు
ఏల కావలె? పదునాల్గు భువనమ్ముల నొక్కపెట్టున
ఎత్తివచ్చిననూ లెక్కచేయక ఒక్క గదాదండము
వంటి రోకలిబండచే నుక్కడింపజేయగల ఉత్తముండ
నగు నన్నే చూసి ఒక్క ఆడది నవ్వి అవమానము
చేసిన యింక నాకీ వూపిరి ఏల వుండవలె? మొన్నటి
ఎన్నికల సంరంభములో రెండువేల రూపాయల
నాటుసారా తెప్పించి అలవాటు వున్న ప్రతివాడి
నోటికి అందించి నిషాతో వాళ్ళ గుండెల్ని నింపించి
ఒక్కొక్కడిచేత లెక్కకుమించిన ఓట్లు పోలుచేయిం
చిన ఈ విచిత్ర దుర్యోధనుండు ఎంతటి ఘనుండో
నీకేమి ఎరుక? అవును నెచ్చెలీ! అవును. ఒక్క రోకలి
బండ నా చేతనుండ ఏ రౌడీమూకయైననూ పారి

పోక తోక జాడించక యుండునా? పాదములపై పడ కుండునా? ఓసీ వగలరాణీ! నిరాడంబరుడనై, నిరాశ్రయుండనై నిరుడు నిర్మల ప్రాణములు ఈ పిచ్చల పిడిబాకుతో తీసిన నేరము సైతము ఇంకనూ నా వీరాదికి రాక- అనుమానము లేక :- అడిగే దమ్ములేక - రమ్మనలేక - కిమ్మనక చట్టముసైతము నోరు మూసినది. ఏమనుచుంటివి? ఒసీ కులుకులరాణీ! నాతో పోటీపడ్డ నారాయణరావును నాటునారా తాగించి - నమ్మించి - నాగుంపీరు చావిడిదగ్గర గిల్లేసి కొల్లేటికి పంపితే నారాయణపట్నం చేరుకున్నాడు నెచ్చెలీ! ఆవూరి మొనగాళ్ళంతా వీరాసాలు తొలిపెట్టి - పంచలు ఎగగట్టి జట్టీలు జట్టీలుగా - పుజ్జీలు జ్జీలుగా - పిడికిళ్ళు బిగించారేగాని ముందుకొచ్చే ధైర్యములేక - మనస్థైర్యము లేక నోరు మెదపలేదు - కాలు కదపలేదు, ఏమనుచుంటివి? నాకు మగతనము లేదనియా నీ అభిప్రాయము? ఓసి పాపిష్టిదానా! కళ్ళుకావరముచేత వళ్ళు క్రొవ్వి ఏవో రాళ్లు రువ్వి ప్రేలుచున్న నీ నాలుకను వేయి చీలికలు చేయకుండిన- ఈ విచిత్ర దుర్యోధనుండు పుత్త్రముండు - జీవించుటే వ్యర్థము నిరర్థకము. ఏమిరా

చిత్రము? ఇంతలేసి కన్నులతో వింతవింతగా చూసి-కిలుక్కున నవ్వి నవ్వి- వగలూ హొయలూ రువ్వి రువ్వి-చటుక్కున తలుపులు మూసుకుని చటుక్కున వెళ్ళిపోయిన యీ పతితను పరాభవించకుండిన- ఇక నేనెందులకు? నా దొంగల పరివారమెందులకు? సారా వ్యాపారమెందులకు? ఏది ఏమైననూ ఈ వలపుకాంత బులుపుతీర్చి - దాని సోయగమంతా దోచి- నేనూ పురుషుండనే- మానధనుండనే - వుత్తముండనే- అని బుజావు చేసుకొనకుండిన నా ప్రతిష్ఠ అప్రతిష్ఠపాలగును. (మళ్ళీ అటువేపు నడిచాడు) వోసీ నవ్వులరాశీ! తలుపు తెరూ! ఏమనుచుంటివి? జేబులో కానులు లేవనుచుంటివా? ఎంత కావలయును నీకు? ఎంత సమర్పించుకున్న - సరసమ్మునకు సిద్ధపడుదువు? తలలు తెప్పించుట- మాటలు మార్చుటలో అందెవేసిన వందెగాడినై అఖండ కీర్తి ప్రతిష్ఠల కతీతుండనై చట్టానిక్కీ, చరిత్రకూ భయపడి - ఒంటరినై - తుంటరినై — ఎక్కడెక్కడో తిరుగుచున్న నా ప్రజ్ఞాప్రాభవాలు అర్థముగాక— యింకనూ వ్యర్థముగా వుచ్ఛరించుచుంటివి నెచ్చెలీ! నీ మత్సరము మానకుండిన

యింక నాకీ మగతనమేల? (తలుపు దగ్గరకు వెళ్లి తట్టాడు) తలుపు తెరూ! వెయ్యిరూపాయలేగదా నీవుకోరినది! నా ఎడమచెయ్యి ఎవ్వరి జేబులో పెట్టినా అది వెయ్యిరూపాలకట్ట పట్టుకొనును! నీకు యిచ్చుకొనును! తలుపు తెరూ! (ఇవతల కొచ్చాడు.)

అవమానము ... సహించరాని మహావమానము! దుష్టదుర్యోధన చక్రవర్తి జీవితము దుర్భలము- దుస్సహము! ఒక్క ఆడదాని నవ్వుల ధాటికి తాళలేక ఎందుకు కరిగే తారలా తారుమారయిన యీ విచిత్ర దుర్యోధనుని బ్రతుకు నిర్వీర్యము- నిష్ప్రయోజనము- నిస్సారము! అసలు సారాపాట పాడు నెపంబున పయనమై యిల్లువిడిచిన నేను నగర మధ్యంబున కేల రావలె? వచ్చితినిపో- చెట్టుకు వ్రేలాడుతూ వూయల లూగుచున్న శవాలనేల తిలకించవలె! తిలకించితినిపో- ఆ మునిసిపాలిటీవారి ముందు కాల్వల మీద ముగ్గులు దిద్దుతున్న దోమ కన్యలనేల కాంచవలె? కాంచితినిపో- ఆకాలువలవ్రక్క నే కాలుజారి- పడి- ప్రాణములు పోగొట్టుకొని- దిక్కులేని చావుకు గురై- బలై- మురికి కంపు కొడుతున్న బిచ్చ

గాళ్ళనూ- కుక్కల్నీ- పందికొక్కుల్నీ- ఏల చూడ
వలె? చూసితినిపో- నడిరోడ్డుమీద మత్స్యరాజములు
నగ్న నృత్యాల దృశ్యాలనేల చూడవలె? అక్కడి
కేల నడుగవలె? అడిగితిపో- కాసారముల నందేల
దాహము తీర్చుకొన సాహసించవలె? సాహసించితిని
పో- కాలుజారి ఆకాసారమున ఏలపడవలె? పడితిని
పో- దూరమునుండి ఆ దొరసాని నవ్వుచూ మగ
తనంబు లేదని పరిహాస వచనంబుల రువ్వుచూ
నన్నేల కించపరచవలె? ఏల వంచించవలె? అహో!
ఇంతటిఘోర పరాజయము జరిగిన తర్వాత వెధవ
ప్రాణములు బొందిలో నిలుపుకొని సారా కొట్టుకు
వెళ్ళినచో ఎల్లరకూ లోకువై పోదునుగదా! (ముందుకు
విచారంగా- బరువుగా నడిచాడు.) ఓయీ! నీవు
ఎవ్వాడవు? నీ పేరు ఎర్రిటోపీయా? అట్లయిన ఈ
ప్రదేశంబునకు ఏల వచ్చితివి? ఏమనుచుంటివి?
ఆహా! పానీడల సంచారము చేయుచున్న నన్ను
పట్టుకొనుటకు వచ్చితివా? ఆహా! కాలమెంత దయ
మాలినది! అనుకూలించక పోతే "వసుదేవుడంతటి
వాడే గాడిద కాళ్ళు పట్టుకున్నాడు" అని శాస్త్రములు

ఘోషించుచున్నవిగదా! కాంతలు నివసించు చోటికి ఏకాంతముగ ప్రవేశించి యిరకాటములో పడితివిగదా! కటకటా ఎట్టికష్టములు వాటిల్లినవి! ఎంత దైన్యస్థితి ఏర్పడినది! ఓయీ! నీవు నన్ను విడిచిపెట్టవలెనన్న నీకేమియిట్లు చెప్పవలె? ఏమిరా! లంచమన్న నీకెగిట్టదా? ఆదేమిరా? నీవు భార్యాబిడ్డలను సుఖముగా పోషించ నిచ్చ గలవాడివి కాదా ఏమి? అవును జీతముచాలక-జీవితాలనుచీకటిచేసుకున్న తెలుగువారి తెలివితేటలు-తేటతెల్లముగా నేనెరుగుదును! ఏమిరా యితని స్వభావము ఎంతకనుమారకున్నది. ఓయీ! నేనెవ్వడినో ముందుగా ఎరింగిన నీవు తోకజాడించెదవు అట్లయిన నాలకించుము ఉత్తముండనగు విచిత్ర ధుర్యోధనుండను నామధేయుండను నేను! మొన్నటి ఎన్నికల జాతరలో పార్లమెంటు సభ్యులుగా ఎన్నికయిన పానకాలరాయుడు గారి భార్య తమ్ముడిని. వారి బావమరిదిని ఏమి అలా గుడ్లు తేలవేసి — తెల్లబోయి చూచుచుంటివి? మన రాష్ట్ర ముఖ్యమంత్రి గారి మూడో భార్య మేనత్త కొడుకును- వారి సోదరుండను. మనజిల్లా అధికారి పిన్నమ్మకు స్వయాన

మరిదిని- వారికి సారథిని. నేను తలుచుకున్న నిన్ను ఏడు జిల్లాల అవతల పారేయించగలను! ఏమిరా? ఇంతకు ముందే అన్ని జిల్లాలు తిరిగితివా? అట్లయిన నన్ను పట్టుకొనుట తథ్యము! ఆహా! "బలవంతమైన సర్పము చలిచీమలచేత జిక్కి- చావదె సుమతీ" అని బుధులు చెప్పిన సూత్రము వ్యర్థము కాదన్న మాట! ఓయీ! రమ్ము! ముందుకురమ్ము- నన్ను పట్టియిచ్చిన సాహసానికి మెచ్చి ప్రభుత్వం నీకిచ్చే ప్రమోషన్ వల్ల నీవుగొప్పవాడివై పోవడం నాకూ సంతసమే. కాని నా దగ్గర అరక్లోడికూర- నాటు సారా వున్నది రుచి చూసెదవా? ఏమిరా! ఆ రెండూ నీకు ప్రియమైన ఆహారములా? అయితే రమ్ము- ఆర గించుము- కడుపార ఆరగించి కైపెక్కి- కైలాసము తృప్తిగా చూడుము. (అంటూ అందించాడు) ఆహా! బాధ్యత- బాధ్యతఅని వాగీ, వాగి... తృటిలో మధు రామృతము సేవించి- మత్తెక్కి- మెత్తబడి- వచ్చిన దారి పట్టిన నీ వెంత ఘనుండవోయీ! విజయము... మహావిజయము... ఈ విచిత్ర దుర్యోధనుండు

విజయ గర్వముతో సర్వము మర్చిపోయినా ఎదురు లేదు. మనదే విజయం_ మనదే విజయం- (అంటూ పెద్దగా నవ్వుకుంటూ దూరంగా వెళ్ళిపోయాడు.)

—: శుభం :—

# ఎలక్షన్ పిచ్చోడు

[అది నాలుగురోడ్లు కలిసిన బజారు. అప్పలరాజు ఎడంచేతిమీదుగా వ్రేలాడుతున్న పూలదండతో ఆ బజారుకు వచ్చాడు. బనీను, పైకెగదోపిన కట్టుపంచ, తలగుడ్డ అతని ఆభరణాలు. దూరంగా ఎవరో పిలిచినట్లు వెనక్కి తిరిగి చూశాడు. ముసి ముసి నవ్వులతో రెండుచేతులూ కలిపి యిబ్బందిగా నమస్కరించాడు.]

అప్ప: దండాలండి! అయ్యాబాబోయ్! తవఁ కాళ్ళకాడ బతికేవోణ్ని. కళ్ళు నెత్తిమీది కెల్లిపోతాయేటండీ

మరేను? సిన్నయ్యగోరా! తవరిష్టి సూళ్ళేదు దొరా దండాలు.

అయ్యబాబోయ్! ఆలాగనెయ్యమాకండి. అంతా తవరి సలవేగదండి మరి? ఎందుకంటారేటండీ? బేగ! ముందు కొచ్చేత్తంటేను? ఇదండి - ఇది - మరండీ - దండగదండీ! పూర్దండ. (అంటూ చేతిమీద దండను ఓసారి తృప్తిగా సూసుకున్నాడు) నా సామిరంగా! బుల్లెబ్బాయిగోరూ! మావోళ్ళంతా నా మెళ్ళో పడేశారు, నా నేనోం మా ఆడదానికేద్దావని అట్టుకొచ్చేత్తన్నాను. అంతేనండి.

అయ్యబాబోయ్! అక్కడే వుంసండి కిటుకు. మరండీ! కులపోళ్ళంతా కూడబలుక్కుని ఎన్ను మా వార్డుమీద నిలేశారు. గెలిపించిపడేశారు. అంతా మా ఆడదాని సలవేనండి. అమ్మతోడు!

ఏటండి ఆలాగనేశారు? తల్లి సిగ్గొయ్యా నా పెళ్లాం ముండ సలవ నేపోతే నాను పడిపోయి వుందునండీ! వత్తానండయ్యగోరూ! (రెండడుగులు నడిచాడు వెళ్ళే వుద్దేశ్యంతో. మళ్ళీ ఆగిపోయాడు. కిసకిస నవ్వుతుంటూ.)

అయ్యబాబోయ్! పెద్దయ్యగోరా! దండాలుండి దొరగోరూ దండాలు. నావంటి - అప్పల్రాజుగోణ్ణి - సాకిరేవుబండకాడ సాయంకాలందాకా తవఁదు ఉతికి పడేసిన బట్టలుతికే అప్పల్రాజుగోణ్ణి దొరా!

ఆయ్యబాబోయ్, అంతమాటనమాకండి. (మళ్ళీ వచ్చాడు ఆమాయకంగా) ఆదేటిబాబో? గొప్పణ్ణయిపోటానికి నానేమన్నా గోరీ కట్టించుకున్నానా యేటి? ఆ మాట... అల్లేరండి బావనయ్య పంతులు గోరు! ఆరు సెబుతా రండి, ఏవఁనంటే- "ఓరి ఎర్రి మొగనా! ఇలా యిగ్రహం కట్టించుకోవాలంటే ప్రజల సేవ సెయ్యాల- ఒళ్ళు కాళ్ళరిగానపడి ఏడుకోవాల" అని ఏంచేతంటే అంచేతేనండి.

నానేవఁన్నా నామాలెట్టుకుని ఏడుకొండలవాన కూకున్నానా యేటి? ఎలచ్చనులో గెలిశాను అంతే గదండి. అదురుట్టం నాదికాదుగాబో - మా ఆడదాంది. వస్తానండయ్యగోరూ! (అంటూ చకచకా నడిచాడు )

ఒరేయ్ గవుఁరీ! నాయాల్దాన రాయే బేటికి. తల్లి సిగ్గొయ్యా నాను గెలిశానే! ఏటే ఎర్రిమొగవా!

వల్లమాలిన సిగ్గొచ్చిపడ్డది? గెల్చానే - మొగోడుగా
నిల్చానే! ఓసి నీయమ్మకడుపు కాల! ఏటే సేటి!
రమ్మంటే గమ్మున వూరుకుంటావ్? ఏటిసెయ్యమం
టావే? పెద్దోరంతా ఎదురవుతావుంటే ఆరికో దండం
పారేసి కొంప సేరేతలి! గండం గడిచినంత పనయింది.
ఎంచేతంటే - ఆంచేతేమరి.

ఏటీ? ఆళ్ళంతా ఓట్లేసి గెలిపించటానికి కారణం
నువ్వా? (నవ్వుకున్నాడు సిగ్గుగా, బిడియంగా) కాదు
లేహే! నీ నవ్వు- అమ్మతోడు! ఎంచేతంటే- ఆంచేతే
మరి! నాసావిరంగా! నీ పెదాలు తమలపాకులతోడా
ల్లాగుండాయ్ గవిరీ! అందుకేగా మోసు నాయాల్ది
నువ్వు నగుతావుంటే మొఖమంతా జిల్లంటాది -
గుండెలో గుబులవుతాది.

అందుకనే గవిరీ! నాకిన్ని ఓట్లు పడ్డాయ్ మరి -
గెలిశాంమరి! అద్గో అదేనే! నీకాడున్న మాలావు
సెడ్డ సిక్కు. ఎరికే లేహే. నువ్వు మాలావు అందంగా
వుట్టావ్. నాను కాదన్నానా యేటి? నువ్వట్టా ముద్దొ
చ్చేలాగున్నావనే ఆళ్ళంతా నాకేసడ్డారు. నా సేవాం

ఆళ్ళ కాళ్ళమీనపడ్డాను. వార్డులో నిలబడ్డాను డోకా లేకండా డోలు మోగించి మరీ గెల్చాను.

నా యాల్దాన నాకు వళ్ళు రేగిందంటే కుమ్మేత్తాను మరి. ఆఁ! జేటికి రమ్మంటే పాకిట్టోవుండి వాగు తున్నావురి? పట్టునాయేటి ఓ పట్టు? ఓసి నీ తల్లిసిగ తరగా - ఇంతలావు ప్రజానాయకుణ్ణాట్టుకుని "నీ జిమ్మడ" అంటున్నావా? శేయ్ గవిఁరీ! గమ్మున జేటికి రాపోతే నానే లోపలకొచ్చేత్తాను - ఏసేత్తాను యాం దండ! ఆసి నీ ఎర్రికూల! వద్దంటూ వేటహే? మనోళ్ళంతా పొగడి, ఒక రేత్తిరంతా తీర్మానం పాస్జేసి, నా మెళ్ళో ఈ దండేసి, ఒక దండంకూడా వడేసి దీవించారే!

ఏటీ! శేయి గవిఁరీ! నాకు తెలవకడుగుతాను నాను నీకు మొగుణ్ణా - లేకపోతే పగోణ్ణా? సెప్పేగవిఁరీ మొగుణ్ణేగందా. ఇప్పుడు నాను ఏటిసేత్తాను సెప్పు? అయినా లోపలచేసే ఎదవపని ఇంతమంది సూత్తుం డగ జేటిసేత్తానా యేటి నీ పిచ్చిగాని! జాగుసేత్తా

ఏటి మరి జమీందారు బిడ్డలాగ. ప్రెజానాయకుడి పెళ్ళానివా నువ్వు?

అయితేమటుకు బేటికి రాకూడదాయేటి? ఎవుడే ఎకవ సచ్చినోడు నీకు సెప్పిందీమాట! అలాగని మరి రేకట్నుంచి కాళ్ళూ, చేతులూ ముడెట్టుకుని- పరంవటి టో కూకోని ప్రెజా నాయకుడి పెళ్ళాని గంపా అనుకుంటే... ఊరోళ్ళ గుడ్డలుతికేదెవురే మరి?

నానా? ఏటీనానా? ఓసి నీ తల్లి సిగ్గోయ్యా సెయ్య బలిసిందే నీకు- ఇంతలావు ప్రెజా నాయకుణ్ణెట్టుకుని ఆరి గుడ్డలుతకమంటావేటే? గూబ గుయ్యమంటాది నోర్మూసుకో- ఏటా సిగ్గు? గులాబి మొగ్గలాగ... ముడుసుకు పోతుందేటే నీ మొగం.

ఆసి నీసిగ్గు సితకా - నిన్ను బండకేసి వుతకా- ఏటే తలబిరుసు? ఓసి నీయమ్మకడుపుకాల. అయ్యనీకి కట్టిపెట్టెహే- ఎంచేతంటే అంచేతనే మరి. నాను గొప్పోణ్ణాయిపోనాను గందా! అంటేత. ఆరిద్దని

నువ్వు, నీపని ఆరా సెయ్యాక తప్పదు. నానేటి సేత్తా నంటావేటి? బెద్దముడిసి నయ్యానుగాద మరి. పూరు మానబడి సేవశేయాలమరి. ఇంతమట్టుకు నీపని నాను ఏవీ సెయ్యాలేదా?

అదేనే- ఆసియ్యాబలిసిన మాటలకే పళ్ళుముండేది- అసలు నీతల్లి సిగ్గోయ్యా పెళ్ళయినప్పట్నుంచి సూత్తన్నా - నానంటే నీకు యిదినేదే... యిది... ఇదంటే తెలవదా యేటి? ఆదేమరి ఎంచేతంటే— అంచేతనే మరి?

ఒసే గవిరా! ఓమాట నిజం సెప్పే - ఆయాల మన పెళ్ళయ్యాక మూడోరేతిరి- ముత్తయిదులొచ్చి మనిద్దరినీ వోగదిలోకి నడితే- నాయాల్ది ఏంచేశా! సెయ్యి! కందకుండా బేటికెల్లిపోయి- గడేసుకున్నావ్. కోడి కూత్తేదాకా నాగోడు యిన్పించుకోనేను. ఎంచేత అంచేతే మరి!

నా పావిరంగా గజ్జల గుర్రంనాగ గంతులేత్తావే గాని వంటమీాన సెయ్యెట్టనిత్తావేటి! పొట్టావులాగ కొరకొర, నూరనూర సూత్తావుగాని. సగుతా నడిరేత్తి

తెపితే నాయాల్ది ఆవులిత్తా ఆవతలకెళ్ళిపోతావు
వళ్ళు నొవ్వాలంటావు, కళ్ళు మంటలంటావు, వల్లగా
దంటావు. ఇంతకీ బేటికి రావన్నమాట! (రొండగు
గులు లోపలకేశాడు.)

నాయాల్ది గవిరీ! నాను లోనికొచ్చావంటే వడే
త్తాను మరి ఈ దండ. శెయ్ గవిరీ! ఈవూటన్నా
కూసింతనవ్వే...కిలుక్కున నవ్వితే సాలు గవిరీ!
కిలుక్కుమంటాది మణుసు. ఎంచేతంటే అందుచేతనే
మరి. అంచేతంటే ఎంచేతంటా వేటెహే-ఎర్రిమొగవా
నువ్వు సొప్పినట్టే ఒప్పేసుకుంటాన్లేయే.

ఏటీ? మనయ్యగోరికే ఓటెయ్యమంటావా? అలా
గనేమరి! ఓటేత్తానని మాటిచ్చినా బేటికి రావు.
వో ముద్దునోటికియ్యవు ఏటే నీ కులుకు? (బజారు
వంక చూశాడు. చేయి అడ్డం పెట్టుకుంటూ.)

అయ్యబాబోయ్! దండాలండయ్య గోరూ! దం
డాలు. శేయ్ గవిరీ! అయ్యగారొచ్చేశారు. మంచ
వెయ్యాలే గవిరీ కూకుంటారు. అబ్బే నేదండి నాయా

ద్ది మా ఆడదానికి మాలావు సెడ్డసిగ్గండి. ఏటండీ అలా గనేశారు? దాంతల్లి సిగతరగా- దానెవ్వారం నాకన్నా తమరికే బాగా ఎరికా ? ఎంచేతండీ ?

హోహో! అంచేతన్న మాట ? కాదంటండి మరి లేదిం దగ్గర్నుంది తవకింద బతికేవోళ్ళం. తమ రిడి చేసిన గుడ్డలుతికే వోళ్ళం. అంచేతనే గదండి నాను గెలిశింది. ఇంకా కిటుకేటి బాబో- కిటుకు. ముంచేశా రా ఏటి కొంప ? ఏటే గవిరి! కిటుకంటా రేటి కిటుకు? అసి నీతల్లి సిగ్గొయ్యా ఏటే అలా కిలుక్కున నగుతున్నావు ? అయ్యగోర్ని చూసేతలికి ఆనందం పొంగిందా ఏటి ? అంచేతేగదటే - మనం ఆరికాళ్ళ కింద బతుకుతుంది? అసి నోర్యూనుకోయే పోనుకోలు దానా !

అయ్యగోయా! తవరొచ్చింది దాన్నడగ మంటా రేటండీ మరీనూ? అదొట్టి ఎర్రిబాగుల్దయిలేను- నాను మటుకు తవరు సెప్పిందానికి కాదంటానా యేటి ? వోటిమ్మంటారా ? గవిరా! అయ్యగోరు నాదిమ్మంట న్నారే. ఆరికేపిత్తానని ముందే సెప్పేశావా ?

ఆసి నీతల్లిసిగతరగా. వో మాట సెప్పనేలేదేటి? ఎంచేతంటే అంచేతేనా? అయితెసర్లె బాబుగోరూ! తపరేవీ అనుకోనంటే వో మాట అడుగుతాను. మాటెందుకు బాబు? మాటయ్యిండినాబు. దీంతల్లి సిగ్గోరయ్యా- మాటిత్తే మాడో నాటి కల్లా సాటుగా సారా కొట్టు కెళ్ళిపోద్దిగదండి మరి? కరక్కట్టుగా నా ఓటు మీకే యిచ్చేత్తాను. ఆ పెసరట్టు నాకు కడయ్యిండ ఏటంటారు? పెసిరెంటా? అదేనంటే నోరు తిరిగి సావటంలేదు. ఆ పెసిరెంటు నాకొగ్గెయ్యిండి. యీాల్లేదండా రేటి బాబు. మావోళ్ళంతా నామీన ఆశెట్టుకుని- ఆవురావురుమంటుంటేను.

ఆయ్య బాబోయ్... అలాగదద్దు మరి-ఆనక మొగమాటం అడ్డం వొత్తె మావోళ్ళంతా నీ మొగమ్మీద వూసేత్తారు. నా వూసె త్తరు గూడాను- ఆదేటి బాబో! అవపాదాలకాడబతికే వోళ్ళం- బొక్కసోళ్ళం- మాకూ సీమూ, నెత్తురూ వుండాయి బాబు! మాట మీన నిలబడే అలవాటు వున్నోళ్ళం దొరా! మొగవాటం ఆడమోకండి. నేకులెత్తి మొక్కుతాను మరి.

ఏటే గవిరీ! అరిగె బెయ్యక పోతె నాతో కాపరం సెయ్యనే సెయ్యవా? ఎంచేత? అంచేతెనా? వాసినీ

తల్లి సిగతరగా! ఎంతమాటన్నావే నాయాల్దానా! మా పన్లన్నీ తవరే జేసి పెడతారు బాబు! నిజవేమరి! నా వాళ్ళు నన్నేవంటారో ఎరికేనా మీకు? ఇళ్ళదేవ్వుంది? ఎడవ్వులూ- అరకాయసారా, అరపేటు కోడి కూరా- ఇళ్ళమొకాన పడేత్తారా? నోరెత్తేవాణ్ణి కడ్డి విరిగ్గొ- తోసేత్తారా!

అలాగయితే నర్లేదోరా, నాది తవరికే యిచ్చుకుంటాను. నానువుచ్చుకునేదేటి బాబూ- యిద్దూరంగా కపోతేను. అడగమంటే బోల్డన్నివయాలున్నయ్ మరి కరారేనంటారా! అయితే యికేం- కాయం ఎంజేతనంటే అవతలోడిన అయ్యగోర్ని పిసిడెంటును జేత్తే ఆయిదేళ్ళదాకా అగపట్టేదంట. అంచేత- అదేనండి- మరండీ మా సిన్నత్తకొడుక్కి- ఓ తమ్ముడున్నాడండి - సదూకుని పట్టా పుచ్చుకున్నాడు గూడాను. ఆడికో వుద్దోగం సూడాలి ఎంతవుద్ది?

అంతెనేటండి బాబూ? సెపితె శానా వున్నాయ్. మా ఊరసావి గాడు లేడండి! ఆడికో పెయ్యేటు మడిసుందండి. దానికి సారాపాట యిప్పించాలి. ఎంత వుద్ది? అంతెనేటండి! మూరజక సంఘవోళ్ళు గుడ్డ

లుతకటానికి సిద్దయిబ్బందడిపోతున్నారు. దిగుడుబాయి కాడ అరేసుకొడానికి పోటుకావాలి. ప్రెత్యేకంగా ఒక సెరువుసూడాల. ఎంతవృద్ది? ముందీయిసయాలు తెల్పండి. వృజ్జోగాని కెంతవృద్ది? సారాపాట కెంతవృద్ది? సెరువు రావటానికెంతవృద్ది? ఆరేసుకునేసోటుకెంత వృద్ది? ఈటి సంగతి తెల్పండి మరి!

అయ్యబాబోయ్! అయిపోటం ఏటండి! సోల్డన్ని యిసయాలున్నయ్ మరి! తవరుఒప్పేసుకుంటేసరే మరి! లేపోతె అంతేమరి! సొంత యిసయాలయితే అంతులేకండా వున్నయి దొరా!

మరండీ మాఆడది లేదండీ! ఆదేనండి- గవిరి! దానికో పిర్రియేటుగాడున్నాడండి ఆడెప్పుడూ యీరాది గుమ్మంలో నుంచోని దీన్నిచూసి ఇకిలిత్తా వుంటాడు. ఆడికాళ్ళు ఇరగగొట్టాల ఎంతవృద్ది?

అంతేనా ఏటండీ! మా గవిరిగో సిన్నయ్య వున్నాడండి- నా కొడుకు. ఆడుసత్తె ఒక కుంటనేల నా పొలంలో కలిసిపోద్ది అణ్ణి యమలోకం అంపాల- ఎంతవృద్ది?

నా యాల్డి దీంతల్లి సిగ్గో యెయ్య- మా గవిరిని పెద్దింటి సిన్నబ్బాయి గోరు కన్నా గొట్టాడంటదో రా! ఆరి రొండుకళ్యాపీకెయ్యాల- ఎంతవుద్ది? ముందీటియెవ్వారము తెల్చండిమరి! కాళ్ళిరగ్గొడితె ఎంత? కళ్ళుపీకైతె ఎంత? దాని సిన్నయ్యను యవలోకం అంపితె ఎంత! ఈ మాటిసంగతి ముందుగా సెప్పండి సరి!

అయ్యబాబోయ్! నేకావని సెబితేనాభంలేదండి బాబో! సాలామంది సెప్పారు- మా కళ్ళుగప్పారు. అంచేత ముందుగా తవరు సెయ్యాల- నా ఓటు వీరా కెయ్యాల అదీ పాయింటు.

ఏటే గవిరీ? సిన్నబ్బాయి గోరు కొట్టింది ఒక్క కన్నేనా? మరయితె ఆ ప్రెయ్యేటుగోడి సంగతేటి? ఓసి నీ తల్లి సిగతరగా! నిన్న రేత్తిరి నువ్వెల్లింది యాడకే మరి? మున్సబుగోరింటికా? ఆరి మాడో తమ్ముడు రమ్మన్నాడా? ఎందుకూ అని? పెళ్ళయి నప్పుట్నుంచి రమ్మంటున్నాడా? సావిట్లోకి రమ్మంటే సిగ్గసిపోకావేటే? సెప్పు- అంచేతేనా?

అయ్యబాబోయ్- అయూ ముందేశా రా నా కొంప ఏటయ్యేగోరూ తవరనేది? వూళ్ళో క్షుద్రికారంకా

ముంచేశావా నాకొంప? ఆరిమాట ముందుగా నాకు సెబితే- ఆరిగుడ్డలన్నీ అట్టుకెళ్ళి నేనూ ఆ సెరువులో ముంచేద్దును గందా? నాయాల్ది పొద్దున్నేదినవ్వట్నుంచీ వూరుమీరాన తిరిగీ తిరిగీ. పెరికటికూడు తినమరిగి నా వూసేమర్చిపోయింది దోవా! యెట్టాగండీ దీన్తో కాపరం సెయ్యాటం?

ఏటంయ్యగోరూ? ఇసువంటి పాపుపనికి తవరూ పాలుమాలారా? అంచేతనే అందరికీసెప్పి, ఓట్లునాకే యించారా? ఇదన్నమాట కిటుకు. అసలు కిటుకు యిదా బాబు? కులపోళ్ళంతా కూడబలుక్కుని నిశేకారని నిన్నటిదాకా మురిసిపోయాను బాబో- అసలీ యెవ్వారమే మరిసిపొయ్యాను.

ఏటే గౌరీ! నా సిన్న తమ్ముడే యిసువంటి యెదవపనికి దించాడా? "అవును మావా! నీ సిన్న తమ్ముడే సిగ్గుమాలిన పనికిదించాడు - నిలువునా ముంచాడు" అని యింకా సెబుతున్నావా! చీ! సిగ్గు లేదంటే నీకు?

ఒలేయ్ గౌరీ వద్దేవాకు. పెసరట్టూ వద్దు, పెసిరొట్టూ వద్దు- నాకీ నెంబరే వద్దు- నాకీ సంబరవేఁ వద్దు

గవిరీ! నాకు పరువు కావాలి. మానం మరేదా కావాలి- ఛీ! ఛీ! వళ్ళు పూరోళ్ళ సేతుల్లో బెట్టి- పోట్లట్టుకొచ్చి-నా కాళ్ళమీాన పడేత్తే ఆటినిపోగెట్టుకని- గొప్పోణ్నాయిపోయ్యాను గందాని- సంకలు కొట్టుగోటం నా కిట్టంలేదే-

నేయ్! కాలుతున్న యి (స్త్రీ) పెట్టె కిందపడి కాలిపోతున్న బొరిలిసు చొక్కాలా- కాలిపోతందే నా మొఋసు. నీళ్ళకడ్డ నిప్పల్లా సిటసిట్లాడిపోతుందే నా గుండె సెఋ వళ్ళమ్ముకుంటే వచ్చిన ఓట్లు సూత్తంటే నాకి రేవు బండకేసి వుతకాలనిసిత్తందే గవిరీ!

ఓసి గవిరీ! యీా అధవబతుకు నాకు వద్దేవద్దు. ఈ మురికిబట్టిన ముండబతుకు- సాకిరేవుకు మోసు కెల్లి- వుడకబెట్టి- వుతికి సలవజేసుకుంటేనేగాని సల్లబడదే నా వళ్ళు.

అమ్మో... అమ్మో... పెద్దరికం అంటే తెగ మురిసిపొయ్యాను బాబు! నెంబరైపోగానే నానో నాయకుణ్నాయిపోతానని సచ్చేంత ఆశబడ్డాను దొరా! గవిరి నా బతుకునిండా మురికిచల్లింది. బీసింగు పౌడ

రులో పడేసి- సెడామడా బాది బాగుచేసుకోపోతే అది సిరిగిపోద్ది- బాబో యీ పెద్దరికాలూ, సుట్టరికాలూ నాకొద్దు. ఎల్లండి బాబు! ఎల్లిపోండి.

సెయ్! కిలాడిదానా! ఎల్లవే- నువ్వూ ఎల్లిపోయే- గమ్మున వుంచుకుంటే నన్నో గంగిరెద్దును చేసి- అడించావు. ఇంకా నువ్విక్కడే వుంటే నిన్ను సాకి రేవు బండకేసి వుతికేత్తాను - వూరేత్తాను - ఎల్లు - ఎల్లిపో - (అంటూ దండతెంపి చిందరవందరగా పూలన్ని చిమ్మి రుసరుసలాడుతూ వెడతాడు.)



# మొద్దబ్బాయ్!

[ మొద్దబ్బాయ్ ... ముద్దుగా మాట్లాడలేడు - మోకాళ్ళదాకా నిక్కరు ... మోచేతులవరకూ బనీను — ముందుకు దువ్విన క్రాపు ముక్కుకు సరిగా పెదవిమీద జోరీగలా విధానం - మెడలో కంటె — చంకలో తాడుతో వేలాడే పలక - ? చేతిలో బలపం - చవకబారు దబ్బాలు - ఈ మొద్దబ్బాయ్‌కి...అలంకరణాలు - కళ్ళునులుముకుంటూ... మధ్య మధ్య ఏడుస్తూ - వెనక్కితిరిగి చూసుకుంటూ - వీధిలోకొచ్చాడు - వుల్లముక్కులో పెట్టి - పెద్దగా తుమ్మాడు - చీదేశాడు. ]

మొద్దబ్బాయ్: — అసలు నేను పోనేపోను - ఆఁ... వళ్ళంతా చితగ్గొడితే...ఎవరుపోతారేం? అవాఁ నేను పోను

పోనంటే పోను - [పసిపిల్లోడిలా - ఏడుపు[illegible]ముఖం ...
చిందులు వేశాడు] పోనమ్మా! మయ్యా[illegible]రాని ... మాష్టేల
నిన్ను కొట్టిస్తాను - పడుము విరిగిందాకా కొట్టించక పోతే..
నా పేరు మొద్దబ్బాయే కాదు...ఊఁ— అమ్మో! రెండో
గళాసులో కొచ్చి వడ్డానుగందే! ఇంకా చదివెందుకే బాగా
చదూకుంటే...పిచ్చెక్కిపోద్దని...బుడ్చిబాబు చెప్పాడుగా!
అందుకని చదువు మానేస్తానే - ఆమాటే అనమాక -

అందరూ పెళ్ళిచేసుకుంటున్నారు- నేనూ చేసుకుంటాను
ఏంచేసుకుంటాను? మయ్యా నిన్ను చేసుకోని... ఏం చేస్తున్నా
డేం? అటే చేస్కుంటాను - ఓ... తెలుసుగా — పెళ్ళాం
వుంటే...భరించిదంట...నీళ్ళుతోడుద్దంట ... వక్కలేను
ద్దంట - తమలపాకు లిచ్చుద్దంట...పాలిచ్చుద్దంట- అందుకని
చేస్కుంటానే - పోమ్మా! నాకసలు చదువు రాటమే లేదు -
బళ్ళోకెళ్ళంగానే ... మాస్టారేమో... మొద్దబ్బాయొచ్చా
డంటాడు - పిల్లలేమో... మొద్దబ్బాయ్ వచ్చాడు... మొద్ద
బ్బాయ్ వచ్చాడని...నాచుట్టూ గంతులేస్తారు- నాకేమో..
బోల్డంత సిగ్గేస్తుంది - అందుకని...మానుకుంటాను -

మయ్యా సెప్పలేదెట్టా? అంటా చెప్పేశాడు కూడా -
రెండో గళాసు అయిపోగానే...నిన్ను చేసుకున్నాడంటగా -
పెళ్ళయిన మూన్నెళ్ళకే... నేను పుట్టానంట - ముందు
ముందుగా...తొందరపడి పుట్టినందుకేగా... మొద్దబ్బాయ్
అని పేరుపెట్టింది? మయ్యే చెప్పేశాడు—

పోమ్మా... నియ్యన్నీ అబద్దాలు - నేనూ యివ్వాడు...
రెండోగళాసులో వద్దాను - మూడోగళాసులో పడాలంటే ..
మూడేళ్ళు పట్టుద్దంట - మొన్న కరణంగోరబ్బాయ్ చెప్పాడు
కరణంగోరబ్బాయికి నాయిరాడేగా? పెళ్ళికూడా చేసుకు
న్నాడు - ఐదునెల్లయింది - పెళ్ళాం నీళ్ళుకూడా పోసుకుం
దంట - ఆర్నెల్లు - ఆఁ - నేనుకూడా చేసుకుంటే... ఆర్నెల్లు
కడుపుతో వుండేది పెళ్ళాం - అదేనమ్మా నీతో వచ్చినదిక్క-
లేసినదగ్గిర్నుంచి - బళ్ళోనే వుండమంటావ్ - బళ్ళోకెత్తే
నేమో... మాస్టారుగోరమ్మాయి వుంటాదేమో - పెద్దమ్మాయ్
లేదూ... గీత... భలేబావుంటది — భలే అంటే... భలేనే -
ఎంతబావుంటదో మరి - బొమ్మలా గుంటది-

రెండు జళ్ళేసుకుంటది - నేలమీద యాలాడేలంగాలు
తొడుక్కుంటది - ఇంత బొట్టు పెట్టుకుంటది- ఒళ్ళంతా పౌడ
ర్రాసుకుంటది- కిళ్ళీయేసుకుంటది జాకెట్టు బిగ్గి కుట్టించు
కుంటది - అమ్మో... గుండీలు ఎనక పెట్టించుకుంటదే - ఎంత
బావుంటదో - ఆపిల్లైనదూ ఎనకే పెట్టించుకుంటదేంటే...
గుండీలు? పదూ అన్ని ఆపిల్లలంతా... ఎనకే పెట్టించుకుం
టారా? మరి నువ్వూ చదూకున్నావుగా! ఎనక పెట్టించుకో
టం లేదేం? గుండీలు - అమ్మో అమ్మో ... ఈసారి
చొక్కా కుట్టించేటప్పుడు... నాక్కూడా ఎనకే పెట్టించవే
గుండీలు - చదూకుంత న్నానుగందమ్మా... నేనుగూడ - ఏం
దమ్మా నవ్వుతావ్? ఇప్పుడు నేను కూడా పెద్దయ్యానుగా-
చూడు... ఎంతయెత్తు - ఎంతలావు - ఎంత బావున్నానో-

ఆయ్యనీ్న...మొయ్యో అడగలేదా ? మరి నాకెందుకు? అడగనే అడగను — అమ్మతోడు - అడిగితే...నోటివెంబడ కొట్టు...ఆఁ.

అమ్మాయ్ ... రోజూ నిన్నడుగుదామనుకుంటానే - మరీ...మరి... నేను బడికెళ్ళగానే...మాస్టారుగోరు మనింటి కొస్తాడెందుకే ? (పెయేటుగా ? అయితే ... నువ్వుకూడా చదూకుంతన్నావన్న మాట బాగా - అమ్మో ... మంచి తెలివే - ఎంతమంది మాస్టారులదగ్గఅ చదూకున్నా ? ఓన్న ప్పట్నుంచీ యిదేపనానీకు ? అబ్బో...నీదిచాలా పెద్దదే ... చదువు - (పెయేటు అంటే... గడేసుకోటం అన్నమాట - గడేసుకుంటే ... చదువు పూరాగా వచ్చుద్దా ? అయితే యింకేం...నేనూ బడికిపోయి...మాస్టారుగోరమ్మాయ్ని యింటోకి పిలిచి - గడేస్తాను - దబ్బునొచ్చుద్దె చదువు - అప్పుడు పెళ్ళిచేసుకోవచ్చు — ఏమ్మా ! అంతేనా ?

భలేభలే...భలే...మా అమ్మ భలేమంచిది. [పసి పిల్లాడిలా...చేతులతో తాళాలువేస్తూ - గంతులువేశాడు] ఏమ్మా చబితే ? మాస్టారుగోరిదగ్గఅ...నువ్వు...పెయ్యేటు చెప్పించుకోటం...మయ్యా కింతమటుకు తెలవదా ? తెలిస్తే యేం ? కొడతాడా ? మయ్యా నిన్ను కొట్టటం... యింతవరకు మాన్లేదు నేను - కొట్టలేకనేగా...యింటిపట్టున వుండకుండా తిరుగుతుంది ? అమ్మాయ్... మరిసిపోయ్యానే ... మొన్నీ మధ్య పండగనాడు...కొట్టాడుగందే...ఎప్పుడంతే ... సంకు

రాత్రిపండుగనాడు...నువ్వు తలనిండా పూలు పెట్టుకోలా ?
అప్పుడు - మద్దెరేత్రిరప్పుడు...మంచం కిర్రుమంటే...మెలకు
వొచ్చింది - తలుపు సందులోంచి చూశా...మయ్యా కొడత
న్నాడు - నువ్వేం పెద్దగా ఏడ్వలేదులే...మూలుగుతున్నావ్
ఏడవకుండా కొడతాడేందే అయ్య ? నువ్వంటే భలేముది-

చెప్పన్లేమరి - చెప్పనంటే చెప్పను - ఇస్కూల్లోకెళ్ళ
నాటికే...లేపట్కుంది...బళ్ళోకెళ్ళనూ- పెళ్ళి చేసుకుంటాను
అం...[అంటూ బద్ధకంగా...రోడ్డుమీద కొంతదూరం నడి
చాడు] మయ్యభలే తెలివైందే - ప్రయోటు చెప్పించుకుం
తంది - పదిపైసలా : ఇయ్యే ... ఐసుకొనుక్కుంటాను ...
చీకితే...భలే బావుంటది - ఏందమ్మా...మాస్టారును రమ్మ
నేదా ? బే...రమ్మంటాను...[మళ్ళీ నాలుగడుగులు వేశాడు.
ఆగాడు] అయనీడకొస్తే...అడనేనేంజేసేదే ? ప్రయోటు చెడి
పోద్దా నేనుంటే ? అమ్మా...మరి...చదూసరిగా...రాపోతే
మాస్టారుగోరు నన్నూకొడతాడా ? ఈపుమీదా ? పిర్ర
మీదా ? ఏందీ...రెంటిమీద్యా కొడతాడా ? బుగ్గలు పిండు
తాడేందుకే పిల్లల్ని ? అట్టనే కొట్టగూడదా ? పెదాలు
కొరుకుతాడు...మధవనచ్చినాడు— నేనొత్తేనే ... గంట
కొటేది ? (అంటూ బరువుగా అక్కడనుండి...కదిలి కొంత
దూరం నడిచాడు - విస్రముడై నిలబడిపోయాడు.]

నమస్కారం మాస్టారూ ! రోజూ...లేవంగానే వస్త

న్నానుగా మాస్టారూ? అమ్మోయ్... మాస్టారు కొడత
న్నారే - (పెద్దగా అరిచి... దిండులు వేశాడు - చేతులు కట్టు
కుని) అమ్మ మిమ్మల్ని రమ్మంది మాస్టారూ! నాకు చెప్ప
లేదుగా? మాస్టారూ! మాస్టారూ...(అంటూ... ఒకటి-
తర్వాత... రెండు...మళ్ళీ నాలుగు వేళ్ళు ఎత్తి చూపాడు)
వద్దంటూ లేంది మాస్టారూ! బళ్ళోకి రాటానికి యాళ్ళుండను
కొండి-మరి... నాటికీవుండదా? ఓ...అవ్వ చెబుతానుకూడా-
"రకితి లేని ఆట...రాత్రి నిద్దర నేటు - భకితి లేని పూజ పత్రి
నేటు- నీతి లేని చదువు...జీతాల చేటురా...ఎలితి సుగుణజాలి
తెలుగు మాలా- మాల కాదురా - బాల...ఆరే అగమూకరా
ముద్దూ! ఓరి నిన్ను తగలెయ్య! ఏంటి మాస్టారూ!
విూరనమన్నట్టే అంతన్నానుగా? నాకొచ్చు మాస్టారూ...
బోల్డన్ని పాటలు...పాడమంటారా? భలేబాగా పాడతానని
మమ్మ రోజూ పాడించుకుంటది- అమ్మే మాస్టారూ నేర్పింది!

"ఆరేసుకోబోయి... పారేసుకున్నాను ... హరే ...
కోకెత్తుకెల్లింది కొండగాలి" [పాటవరుసలో అన్నాడు.]
ఇంకోటా! సిలకకొట్టుడు కొడితే...సిన్నదానా! పలకమారి
పోతావే...పడుసుదానా!" చూడండి మాస్టారూ!ఏళ్ళంతా
నవ్వుతున్నారు? మంచిపాటా! "ఎత్తమంటావా? నువ్వొత్తు
కుంటావా" ఇది కూడా మమ్మే నేర్పింది మాస్టారూ! సుమతీ
శతకంలో పద్దెమూ! శ్రీరాముడు దయచేసెను...తారోడ్డు విూన

సకలజనులు కొలాడంగా...పొండి మాస్టారూ ... నవ్వు
తన్నారు - [పెద్దగా ఆవులిస్తూ చిటికెలు వేశాడు.]

మమ్మ చెప్పింది మాస్టారూ! [పెయేటు చెబుతున్నా
రంతగా మమ్మకి? గడేసుకుంటే ... భలేతొందరగా వచ్చు
ద్దంటగా చదువు? ఇదీ అమ్మే చెప్పింది? తొందరగా
యెల్లండి మరి - ఆడుకోమంతారా? ఓల్ రైటు... బేషుగ్గా
ఆడుకుంతాం - తొక్కుడుబిళ్ళాట ఆడుకుంతాం - వుల్లాబ
ఆడుకుంతాం - ఎంతసేపయినా ఆడుకుంతాం మాస్టారూ!
ఇంటికొస్తే...అమ్మతన్నుద్ది - ఇక్కడే భలేబావుంటది -
[వెళ్తున్న మాస్టారును...నిశితంగా చూస్తూ నిలబడిపోయాడు.
వెనక్కి తిరిగేసరికి - వాకిట్లో పెద్దమ్మాయ్ కనపడింది..
ఆత్రంగా...ఆమెవేపు రెండడుగులు వేశాడు.]

మాస్టారు పొయ్యారుగా! రామరి...ఆడుకుందాం -
ఇయ్యాలకూడా...నీకోసం లడ్డు తెచ్చాను. చూడు...ఎంతలా
వుందో! [జేబులో చేయి పెట్టి చూశాడు] అమ్మో...చెయ్యి
పెట్టనిస్తానూ? నువ్వు చెయ్యి పెడితే. వూపి గాడదు - నలిపే
స్తావుగా? ఛీ! పాడు...లాగంతా చెడిపోద్దమ్మాయ్ - తీసి
పెడతానుండు - జేబులో చేయి పెట్టాడు బలవంతంగా] పెద్ద
పెద్ద జేబులు పెట్టమంటే చిన్న చిన్న జేబులు పెట్టాడు
దెవనోడు కాల్లెవట్టి చావదమ్మాయ్ -

తీసి నీచేతిలో పెడతాను...తర్వాత నోట్లో పెట్టుకో ...
ఏం?...అదేనమ్మా...నీతో తంటా- సరేపట్టు. చెయ్యి పెట్టు
మొత్తం నువ్వే తినకో - అసలు నేను రోజూ లడ్డు తెచ్చేది.
నీకు పెట్టటానికేగా? తీసుకోమరి ... బుజ్జమ్మాయి చాలా
మంచిది - కళ్ళు మూసుకుంటాను...నలపకుండా తీసుకో...
ఏం...(అంటూ కళ్ళు మూసుకుని నిల్చున్నాడు)దొరికిందా?
దొరికిందా? చేతికి చిక్కిందా? పట్టుకున్నావా? అబ్బా...
చెయ్యితియ్యి - (పిలికలు తిరిగాడు) ఎందమ్మా నలిపేశావ్!
చూడు...జేబు చెడిపోయ్యింది - నీ చెయ్యి పెద్దది - నా జేబు
చిన్నది - బలవంతంగా లోపలకు నెడితే...చిరిగిపోయ్యింది.
మమ్మీకన్నద్ది - [చూపుతున్నాడు జేబు]

పెద్దమ్మాయ్! రోజూ ఎవరికి పెట్టించుకునేదానివిగా
ఎవరికి పెట్టవన్నావా మనవోడు? అదేనమ్మా గుండెలు...
ఛీ! పాడు...ఇదేం బావుందలా! మాటు...పెద్దమ్మాయ్..
పెద్దమ్మాయ్...జిలుబుడతందిగానీ...గీరవూ? [వీపురిస్తాడు]
అబ్బ — సమ్మగావుందమ్మాయ్ ... నువ్వు గీరతంటే -
[మామూలుగా యెదురు బొదుతుగా నిల్చున్నాడు] చదువు
తొందరగా రావాలంటే... ఏంచెయ్యాలి పెద్దమ్మాయ్?
నీకూ తెలవదూ? తెలుసులే...బడాయి — అంతా అబద్ధం-
మమ్మా చెప్పిందిగా? సరే...సరి...ఇటురా...మరే... ఛీపో

సిగ్గేస్తుంది ఇంట్లోకెళ్ళి ... గడేసుకుంటే ... గబగబా వచ్చే
సుద్దంటగా... ఆఁ... చెప్పేశాను... చెప్పేశాను ... (అంటూ
ఎగిరాడు కాసేపు]

నాకు చెపితే ఏమమ్మా? మాస్నారుకు చెబుతావనా?
[ఇకిలించాడు...ఎవరికీ వినిపించకుండా] మాస్నారు కూడా..
గడేసి...ప్రేయేటు చెబుతున్నాడుగా? ఎవ్వరికేటి పెద్దమ్మాయ్?
మమ్మాకే...(ఆ మాట రగబడి నవ్వింది కాబోలు— దిగాలుపోయి..
దిక్కులు చూస్తున్నాడు] ఏందమ్మా నవ్వుతున్నావే! ఛీ పో..
నీకేదీ చెప్పకూడదు - (వెళ్ళబోయాడు...మళ్ళీ త[illegible]న
తిరిగాడు] లేకపోతే ఏమిటమ్మా! ఎగతాళి చేస్తున్నావు?
మాస్నారు...ప్రేయేటుకి చెప్తున్నాడు కూడా... గడేసుకుని
నేను నాకు నేర్పి...చక్కవు గాదూ? అబ్బా...మా లావు తెలిసి
నట్టు - మాస్నారు...ప్రతిరోజూ ... మా యింటికొస్తాడు...
తలుపు మూస్తాడు... నన్ను...లోనికి పిలుస్తాడు...గడేసు
కుని ... మొదలుపెడతారు...ప్రైయేటు- అయిపోగానే...
తలుపు తెరుస్తారు- ఏంటమ్మా అంతసిగ్గు? అట్టా చూస్తే...
వళ్ళు కంపరం పుట్టుద్ది - ఆఁ చక్కిలిగిలి పెట్టినట్టవుంటది
పెద్దమ్మాయ్ - ఎందుకని? ఛీ! పో...పాడుపిల్ల - ఆ మాట
లంటే నాకు...భలేసిగ్గు —

అబ్బ...ఎన్నిసార్లు చెప్పాలేం? అర్థమే గాదు. మొద్దు-
మరే... "అమ్మా అమ్మా! తొందరగా పెళ్ళిచేసుకో నా

లంటే...ఏంజెయ్యాలే అన్నా - తొందరగా చదూకోరా
బుజ్జీ - అంది తొందరగా చదూకోవాలంటే...ఏంజేయ్యాల్
అన్నా - గడేసుకుని చదూకోరా మొదూ అంది - "గడేసు
కోని చదూకుంటంటే... ఒక్కోటి ఎక్కిపోతావుందాను...
నన్ను చూసైనా నేరుసుకోరా చిన్నినాన్నా" అంది పెద్ద
మ్మాయ్...అందుకని...మనంకూడా...లోపలకెళ్ళి..గడేసు
కుందామా? మానాన్నకు తంతాగా? మయ్య మమ్మను
తంతం లేదుగామ్మా? నీదంతా బూటకం ఎంతబాగా చదూ
కుంటున్నారో లోపల - మాపిటేలదాకా బేటిక్కిరారు -
పేరియేటు చెప్పటం...నీకు తెలవనే తెలవదు...రేపుమ్మంది
వంకాయల చూస్తానుగోరి...చిన్నమ్మాయికాడి కెల్తానమ్మా
భల్ బాగ చెప్పద్దంట -

ఏంటి పెద్దమ్మాయ్? అది చదూ కాదూ? మరేంటి?
సరసమా? ఏదేంటమ్మో - కొత్తమాట - సరసం ... అవి
నూవ్వంతంటే...నాకు చలిచలిగా వుందమ్మాయ్- ఓ సుబ్బో,
నీకు కానామనవ్వార్గాలు తెలునే-చలి కాచుకోట మా? మంటేను
కుంటారా! మరి సత్తెవ్వా కాచుకుంటాదు? గుండెల్లోమంటలు
మండుతాయ్ - అంటుకుని...ఒకర్ని ఒకరు కప్పుకుంటారా?
భలేబావుందే- మరేమరే...పెద్దమ్మాయ్...ఇంకోడ్డు తెచ్చి
పెడతాగాని...మనమూ కప్పుకుందామా? కప్పుకోటం అంటే.
ప్రేమించుకోటమా! [వింతగా...వికారంగా నవ్వాడు...

మెడమీద చేతులు బెట్టుకుని...ఆమెమీద ఎగబడినట్లు ముందుకు పోయాడు - రాళ్ళు మొలేసుకున్నాడు...దావాపు మెలికలు తిరిగాడు]

పెద్దమ్మాయ్...ప్రేమించుకోటం. అంటే... నాకూ నేర్పవూ? తెలివదుగా! అసలు నేనింతవరకు ... ఎవుర్ని ప్రేమించలేదుగా ... అమ్మతోడు...నాకు తెలిసివుంటే ... ముందునిన్నే ప్రేమించి పడేసేవాణ్ని ఆఁ - ఓలమ్మో:. శానాకతుందే ... ఒకర్నొకరు. . యిదిచేసకోటమా! భలే బావుంటది పెద్దమ్మాయ్-నాకన్నా ... నీకు బోల్డన్ని ప్రేవలు తెలుసే - ఎందుకు తెలవదేం? ప్రేమించు కోటం తెలుసా? కవ్వకోటం తెలుసా? సలికాచుకోటం తెలుసా? ఇదిచేసు కోటంతెలుసా? అన్నీతెలుసు - ఒక్కటన్నా నాకు తెలవదు పెద్దమ్మాయి... మొద్దబ్బాయిని___

పెద్దమ్మాయి పెద్దమ్మాయ్! మొమ్మాయి ఎట్లావుందా? అబ్బ!... చలికేవమ్మా? నేనే చేస్తానూ? కవ్వకుం దాంటే ... సవ్వాకవ్వకోలేదుగా? మొన్నయాడ పెళ్ళింటో చెప్పవూ? అవునవును. వూరికెళ్ళిందిగా... నాకు భలే మతిమరుపు — ఏదీ గ్యాపకం వుండదు — మట్టిబుర్ర- మమ్మ లేచిపోయ్యిందంటగా? మామ్యాలేవు కల్లాడా?

మరి ... నువ్వు నన్ను లేపుకుపోతే ... ఎంత బావుంటదో -
(నాలుక కొరుక్కుని చెంపలు వేసుకున్నాడు.) అబ్బ !...
తప్పేందమ్మా ? తప్పయితే మయ్యమెమ్మను తీసుకెళ్ళ
లేటి ? అదే పెద్దమ్మాయి - మాస్నారుగోరు మమ్మల్ని -
మయ్యమెమ్మకూ - నేను ... నీకు .. లేచుకుపోతే ....
ప్రేమేటిగా పెద్దమ్మాయి !

లేచిపోటం తప్పెలాగాదు - నాకు తెలవదాయేంటి ?
ఓల్ రైటుగా తెలుసు - మా పెద్దమ్మ కొడుకు లేడూ...
ఎంత బావుంటాడో ... మా మేనత్త కూతురు లేమూ ...
మేనక ... దాన్ని ... లేపుకుపోయ్యాడుగా ? వాళ్ళంతా
బాగా చదూకున్న వాళ్ళా ? ఎవురన్నారమ్మా ? ఏం కాదు
... మా వోడికి మూడు - ఆ పిల్లకి రెండే గళాసులు -
నాకూ బాగా తెలుసు - మూడో గళాసులో పడాలంటే ..
ముదిరిపోవాలని... బుజ్జిగాడు చెప్పాడుగా ? నియ్యారెండూ
నాయి మూడూ.. చదవటం లేదేట్లా ? సరిగ్గా సరిపోతాయి
గూడా — రామ్మా ! కప్పుకుందాం (అంటూ ఆత్రంగా
ఆమెను కప్పుకునే ప్రయత్నం చేశాడు - ఆమె తప్పుకుంది ..
అక్కడే గుంజేదో వుంటే ,.. దాన్ని కళ్ళు మూసుకుని ...
వాటేసుకున్నాడు - కిలకిలా ఆమె నవ్వుతుంటే ... కళ్ళు
తెరిచి ... అప్పటికి గ్రహించాడు పరిస్థితి)

పెద్దమ్మాయి .. గుంజ ఎంత బావుందో — కళ్ళు మూశ్నానుగా ? పోమ్మా ! నువ్వు చిక్కటంలేదు ... నేను యింటికి పొయ్యి ... పార్వతిని పిలిచి ఆడుకుంటాను. రోజూ ఆడుకోటం లేదట్రా ... పార్వతయితే .. రేత్తిరి మా యింటోనే పడుకుంటది - వాళ్ళింట్లో మంచం ఖాళీ లేదని.. మా యింటోనే పడుకుంతంది - తానాళ్ళ నుంచి పెద్దమ్మాయి — ఒసెయి పార్వతి ! కింద పడుకోమాక ... పడుములు నొప్పి పుడతాయి - మొద్దబ్బాయి ఒక్కడే పడుకుంతన్నాడు - వాడి దగ్గరే పడుకో" అని మమ్మ చెప్పింది - అందుకని .. చిన్న మంచమ్మీద - పార్వతి ... నేనూ - పడుకుంతున్నాం — అబ్బో .. నియ్యంతే వుంటది పెద్దమ్మాయి- నేనేమో.. అటు తిరిగి పడుకుంటాను .. పార్వతేమో ... ఇటు తిరిగి పడుకుంతది - అబ్బ ... కాదమ్మా... నేనమో ... ఇటు — పార్వతేమో అటు (చేతులతో అభినయించాయిడు - కుదరలేదు... చెప్పవలసింది),

కుదరటంలేదు పెద్దమ్మాయి ! ఇటూ - అటూ... కాదు కాదు... అటూ ఇటూ — అట్టాకాదు పెద్దమ్మాయి నువ్వు యిటు తి.గు — నేను అటు తిరుగుతా - అప్పుడు

కుదురుద్ది - (అంటూ ఎదురుగా వెళ్ళి ... కడుపు ఆనించాకు ఆమెకు) ఆఁ కుదిరింది - కుదిరింది. పెద్దమ్మాయి ... యిట్టనే — కరుసుకోని పడుకుంటాం - భలే బావుంటది — కబ్బాకోటం అంటే - యిదేనా? ఆట్టా సెబ్బా — పార్వతికి యెనక పెట్టించుకునే అలవాటు లేదుగామ్మా గుండీలు! అందుకని ... నువ్వంటే ... ఎంతయితో — మాపిటేల రమ్మంటావా? ఎందుకూ? సెలిగా ముకోటానికా? ఓ. ఎగిరి గంతేసి వచ్చేస్తాను ఆఁ - మరి మా స్వారుగోరో — వూరికి పోతారా? ఎప్పుడొస్తారూ? అట్టయితే ... నువ్వొక్కడానివేగా యింటో? భలే భలే నీకు భయ్యం అం... మాస్సారు నన్నే వుంచుతాడు - ఏమ్మా నన్నుంచుకుంటా.?

మరే.. పెద్దమ్మాయి! మునుపు మాస్సారు తిరుపతి ఎల్లినే- అప్పుడు చేసుకోలా! అది చేసుకుందామా? అదుంటే. యిదమ్మా! అంతా తెలవనట్టు! ఇది అదేనా ఇది అదేనా? [ఏమిటో తెలిసినట్టు...వింతగా — విచిత్రంగా నవ్వాడు] మాస్వారుగోరు వూరికి పోతున్నాడుగా! పెద్దాళ్ళమయితే... అదే చేసుకోగూడదా యేంటి నీదంతా యిది - నన్ను చూస్తే సిగ్గేస్తుందా? నాకూ...సిగ్గేమిటి -

పార్వతిగూడా... యిట్టనే అంది పెద్దమ్మాయ్...నన్ను చూడంగానే...సిగ్గుముంచుకొస్తుందంట — నీకూ అంతేనా మరి? అయితే యింకేం? ఖలేచాన్స్ కుదిరింది... ఈ దెబ్బతో పెళ్ళి అయిపోతదిగూడ - ఇంటికెళ్ళి...నూనెబాగా రాసుకుని.. మాపిటేల వచ్చేస్తాను - అప్పుడు చేను కిందాం - మరిపొయ్యొస్తా - ఈ పలక - బలపం...భూలంపడేసి... మ[illegible]పం చాతేదూ...మడతబెట్టి...లుంగీ కట్టుకొనివస్తా .,అబ్బపోయ్యా ఈలావు బిఱుగావుంటేను - వస్తాను - [అంటూ...పలక - బలపం...చేతికితీసుకుని...కొంతదూరంపడిచాడు... అక్కడ ఆగిపోయాడు...బలపం విసిరి...తలుపుకేసి కొట్టాడు...పలక గూడా...విసిరేశాడు] అమ్మాయ్! ఓసమ్మా! తలుపురియ్యే అకలేస్తంది- పలకా! వగిలిపోయింది-(స్థాయిపెంచి అన్నాడు) ఓసినీయమ్మ...మళ్ళీ తలుపేసుకున్నావేంటే ... ప్రైయేటు కాలేదా? తలుపురియ్యే...ఆకలేస్తంది -

ఆబ్బ...ఇంకెంతసేపమ్మా! పొద్దుట్నుంచి ఏంజేస్తున్నారు? పనికాబోలానికి? పనిలో వుంటే... తలుపురియ్యగూడదాయేంటి? కడుపుమండిపోతుంటేను - నాకూ పని వుందమ్మా! మాస్సారుగారి యింటికాడ...దబ్బున రమ్మని చెప్పింది... పెద్దమ్మాయ్... ప్రైయేటు చెప్పద్దంట - నీకు

మాస్టారుగారు చెప్పేటంతదాయేంటి? అదే చెప్పొద్దంట - ఇయ్యాళే మొదలు - ఇంకా పెట్టలేదే - మాపిటేల మొదలు పెడతా — బేటికి రాదేంటి యెంతసేపున్నా - (అంటూ తలుపు సందుల్లోంచి తొంగిచూస్తాడు ]

అబ్బో... మాస్టారుగారు యింకా యీడేవున్నాడే - పెరియేటు చెప్పించుకునేది... మంచమ్మాయా? మరి ... పెద్దమ్మాయి చెప్పదే! భలేబావుందే - సరిగావుంటే... కప్పుకున్నారా? ఓసేయ్ అమ్మా! నీకూడా సరేనా? మాస్టారుగారి అమ్మాయ్ కూడే సరేనంట-నమస్కరమ్మంది మాటేల-నమస్కారం మాస్టారూ! పాపం...సెమటపట్టిందే! మంచం పెరట్లో యేసుకుంటే - చల్లగా వేసుద్ది మాస్టారూ! మమ్మకేం తెలవదు -

మాస్టారూ! ఇయ్యాలమీరు వూరికెళ్లన్నారంతగా! పెద్దమ్మాయ్ చెప్పింది - రమ్మంది మాస్టారూ! ప్రెయేటు కూడా చెబుతానంది - మీరు మమ్మకి చెప్పటంలా! అట్టా చెబుతానని... ఒట్టేసుకుంది - మీ అమ్మాయ్...తొందరగా

ఎల్లుండి మాస్టారూ వూరికి - వలకాబలపం వద్దంటగా ... ఫ్రైయేటుకి - అందుకని పగలగొట్టేశాను -

మరి...మమ్మికి పలకేది ? ఎప్పుడో పగిలిపోయిందా! చిన్న పెద్దమ్మాయి పలకగూడా పగిలిపోయిందిమాస్టారూ! ఏంటిమాస్టారూ ! మమ్మను గూడా తీసుకుపోతారా మరి నేనో - పెద్దమ్మాయికాడేనా సరేలే... నాలుగు రోజుల దాకా రామోకండి - వస్తే నామీద ఒట్టే - ఏదీ...చేతిలో చెయ్యెయ్యండి- అమ్మోయ్ ! మాస్టారు భలే మంచివారే! నిన్నుకూడా తీసుకుపోతన్నారు -

అమ్మోయ్ ! నువ్వొచ్చేసరికి... పెద్దమ్మాయిగా నేనూ ఆది చేసుకుంటాము- ఇప్పుడు మీరిద్దరూ చేసుకోలా...అది- ఏంటూ స్టారూ ఆ...తలూపారు...తలూపారు...మన్నువుట్ట నువ్వనాతిముండ - చూడండి మాస్టారూ ... ఇప్పుకొట్టి పోతంది- అమ్మోయ్...మయ్యరాగానే చెబుతాగా! మరి... లేపోతే...తూకి చెయ్యెత్తితే... చెప్పనాయేంటి ఏం పో... పార్వతి బావుండదు ... పెద్దమ్మాయైతే బావుంటది - అమ్మోయ్! బస్సుదాకా నేనూవస్తానే- సంచి మోసుకొస్తాగా మాస్టారు మోస్తారె సంచులు. అర్థయ్యాపాయిస్తే ...

నాలుగుజీడీలు - ఒకలడ్డు - కొనుక్కుంటాను. పెద్దమ్మాయికి లడ్డుపెట్టాలమ్మా! పెట్టకపోతే వూరుకోదు ... కొనుక్కుంటానే - ఓ...మమ్మిభ లేది — మమ్మిభ లేది - [పసివాడిలా గంతులు వేశాను] ఓరెయ్ బుజ్జీ! మమ్మి లేచిపోతంది. మాస్టారు గోంతీ వూరికి...లేచిపోతందిరా - మనకి బడే వుండదు...శలవుల్ - ఏం మాస్టారూ! శలవుగదూ'



ఇకనుంచి మనం ఆడుకోవచ్చు... పాడుకోవచ్చు - రికాంగా తిరగొచ్చు - మళ్ళీ యిప్పుడు రారు... మాస్టారుగారు - వచ్చేదాకా ... పెద్దమ్మాయికి లడ్డుపెట్టేదినేనే - తోడువుండేదినేనే- ఇద్దరం ఒక్క మంచంమీదే పడుకుంటాం గూడ...మాస్టార్ని అడుగు - ఏంమాస్టారూ! మీరూ అమ్మాయిగా నేనూ...ఒక్కటు చామిమ్మాదేగా చదూకునేది!



అమ్మోయ్! మాస్టారు పోతున్నారే- నేనేమన్నాను? ఏరా బుజ్జీ! ఏమన్నావు చెప్పు - నేనేమీ అన్లేదే అమ్మా.. నీతోడు - ఆయనే ముఖంముడుచుకుని ఎల్లారు - అబ్బా... అమ్మోయ్...కొట్టమాకే...అమ్మోయ్... కొట్టమాకే ... అమ్మోయ్...నీకుదణ్ణం పెడతానే - మాస్టారును నేనేమీ అన్లేదమ్మా! కొట్టమాకే... చెంపపగిలిపోయింది - మాయ్యాని

రానీ ... పట్టి టోపడేసి...కొట్టిస్తాను - నడుములు విరిగిం
దాకా కొట్టిస్తాను - వృత్తవున్నానికే ... పళ్ళు రాలిందాకా
కొట్టావం వహ్మా! నెత్తురు...అమ్మాయ్...నెత్తుర్ - ముక్కు
పగిలింది- నెత్తురు...నెత్తురు...నెత్తురు...[అని పసిపిల్లాడు...
ఎవరో కొడితే...ఏడ్చినట్లు...తెరలు తెరలుగా ఏడ్చాడు...
కళ్ళు చేత్తో నులుముకొంటూ...రోడ్డుమీదా నడిచి వెళ్ళాడు -
విషాదసంగీతం వినిపిస్తుండగా - తెర సున్నితంగా జారిపడింది]

—: సమాప్తం :—